# సీతారామాయణము



కుమారి రావి సీతాదేవి
కుమారి రావి గౌరీనాగేశ్వరీదేవి



ప్రకాశకులు :

రావి బ్రదర్స్

పలాసా, శ్రీకాకుళం జిల్లా.

 1957 [రు 2—0—0

ప్రథమ ముద్రణము :
9157

ఇందలి
పద్యములు
వరుసగా లేవు
కావున, అవతారిక
"విద్యాప్రవీణ" "భాషాప్రవీణ"
శ్రీ కూచిభట్ల చంద్రశేఖరశర్మ
ఓరియంటల్ కాలేజి, విజయవాడ
గారు వ్రాసినందులకు
వారికి మా
కృతజ్ఞతలు.

*

గ్రామస్వారాజ్య ప్రెస్.
విజయవాడ – 2

# వంశ పరిచయము.

అదియొక మహావృక్షము. అబ్బా! ఎంతవిశాలమయి నది? ఎన్ని శాఖోపశాఖలు!! ప్రాణులకు ప్రశాంతతను ప్రసాదించు చల్లనినీడ. మూరెడుకాదు, బారెడుకాదుకదా! కనుచూపు మేరవరకు నిర్మలమయిన నీడయే నీడ. నసులేమి, గానరులేమి, ప్రతియొక ప్రాణియు శాంతిసౌఖ్యాలతో ఉయ్యాలలూగుచుండెడితావు. అనేక ద్విజబృందములు ఆవాసములు ఏర్పరచుకొని ఆత్మానందమును పొందుచుండెడివి. ఆ మహావృక్షము మధుర ఫలభారసమన్వితము. లలిత సుమ శోభాకలితము.

అదియే రావివారి వంశవృక్షము. ఆవృక్షమూలమందు ధ్యానమగ్నుడై దక్షిణామూర్తివలెనున్న వ్యక్తి మూల పురుషుడు నాగేశ్వరస్వామివారు. ఆయన వెలనాటిబ్రాహ్మ ణుడు. గొప్ప ధర్మనిరతుడు. సౌశీల్యశక్తిసంపన్నుడు. ఆయనలో దైవభక్తిమెండు. ఆధ్యాత్మిక చింతనకు ఆత్మా ర్పణము చేసిన ఆనందమూర్తి. ఆయన ధర్మపత్ని గౌరీదేవి. భర్తకుతగిన భార్య. అన్నివిధములను అనురూపవతియైన ఆమెను భార్యగాపొంది అర్థనారీశ్వరుడైనాడు ఆమహ నీయుడు.

ఆపుణ్యదంపతుల తపఃఫలమో యన్నట్లు జానకీరామయ్య పం[illegible]లుగారుజన్మించినారు. ఆయనజీవితము ఆదర్శపూర్ణము. ఆ[illegible]వ మెణకువ అధికము. "మాతృదేవోభవ, పితృదే వోభవ" అను సూక్తులు ఆయన జీవితమునకు గీటురాళ్ళు.

ప్రథమ ముద్రణము :
9157

ఇందలి
పద్యములు
వరుసగా లేవు
కావున, అవతారిక
"విద్యాప్రవీణ" "భాషాప్రవీణ"
శ్రీ కూచిభట్ల చంద్రశేఖరశర్మ
ఓరియంటల్ కాలేజి, విజయవాడ
గారు వ్రాసినందులకు
వారికి మా
కృతజ్ఞతలు.

*

గ్రామస్వరాజ్య ప్రెస్,
విజయవాడ – 2

# వంశ పరిచయము.

అదియొక మహావృక్షము. అబ్బా! ఎంతవిశాలమయి నది? ఎన్ని శాఖోపశాఖలు!! ప్రాణాలకు ప్రశాంతతను ప్రసాదించు చల్లనినీడ. మూరెడుకాదు, బారెడుకాదుకదా! కనుచూపు మేరవరకు నిర్మలమయిన నీడయే నీడ. నరులేమి, వానరులేమి, ప్రతియొక ప్రాణియు శాంతిసౌఖ్యాలతో నుయ్యాలలూగుచుండెడివారు. అనేక ద్విజబృందములు ఆవాసములు ఏర్పరచుకొని ఆత్మానందమును పొందుచుండెడివి. ఆ మహావృక్షము మధుర ఫలభారనమ్రము. లలిత సుమ శోభాకలితము.

అదియే రావివారి వంశవృక్షము. ఆవృక్షమూలమందు ధ్యానమగ్నుడై దక్షిణామూర్తివలెనున్న వ్యక్తి మూల పురుషుడు నాగేశ్వరస్వామివారు. ఆయన వెలనాటిబ్రాహ్మణుడు. గొప్ప ధర్మనిరతుడు. సౌశీల్యశక్తిసంపన్నుడు. ఆయనలో దైవభక్తిమెండు. ఆధ్యాత్మిక చింతనకు ఆత్మార్పణము చేసిన ఆనందమూర్తి. ఆయన ధర్మపత్ని గౌరీదేవి. భర్తకుతగిన భార్య. అన్నివిధములను అనురూపవతియైన ఆమెను భార్యగాపొంది అర్థనారీశ్వరుడైనాడు ఆమహనీయుడు.

ఆపుణ్యదంపతుల తపఃఫలమో యన్నట్లు జానకీరామయ్య పంతులుగారుజన్మించినారు. ఆయనజీవితము ఆదర్శపూర్ణము. అణకువ మెణకువ అధికము. "మాతృదేవోభవ, పితృదేవోభవ" అను సూక్తులు ఆయన జీవితమునకు గీటురాళ్ళు.

ఆయన తల్లిదండ్రులను దైవముగాభావించి సేవించిన యథార్థ సేవకుడు. పితృపాదులు పరమపదించిన తరువాత శ్రీకాకుళము జిల్లా టెక్కలితాలూకా కవిటాగ్రహారములో దేవాలయము నొకదానిని కట్టించి అందు తన తల్లిదండ్రులపేర శ్రీ గౌరీ నాగేశ్వర స్వామివారి ప్రతిష్ఠ చేయించినాడు. టెక్కలి ఎస్టేటునకు దివానుగా పనిచేసినాడు. స్వార్జితమయిన సంపత్తి దేవాలయమునకు అర్పించినాడు. యింతేగాక టెక్కలిలో సత్రముకట్టించి నిరతాన్నదాతయని ప్రశస్తిగాంచినాడు. ఈ రీతిగా లౌకికముగాను పారలౌకికముగాను పరాత్పరుని సేవించిన మహనీయుడు ఆ జానకీరామయ్యపంతులుగారు.

ఆసమయములో జగన్నాథ పండితుడను ఒకబ్రాహ్మణోత్తముడు గుంటూరు ప్రాంతములో నివసించుచుండెడివాడు. ఆయనకు ఒకనాడు లక్ష్మీనరసింహస్వామివారు కలలో దర్శనమిచ్చి 'నీ పంచాయతన దేవతార్చనను రావి జానకీరామయ్యగారికి ఇమ్ము' అని చెప్పగా ఆయన ఆదేవతార్చనను శిరస్సున నిడుకొని పాదచారియై యీ మహనీయుని సన్నిధికి చేరి భగవదాజ్ఞ పాలించినాడు. ఆదేవుడు వేంచేసి నప్పటినుండియు రావివారి వంశమున సిరిసంపదలు మూడుపువ్వులు ఆరుకాయలుగా వృద్ధిబొందినవి.

జానకీరామయ్యపంతులుగారి ధర్మపత్ని కామాంబ. ఆదంపతులకు సంతతిలేదు. తుదకు వారు 'మధుపాడ' అను గ్రామములో నివసించు నొక యుత్తమగృహస్థుని బిడ్డను

దత్తతకు తెచ్చుకొనినారు. ఆదత్తపుత్రుడే రామయ్యపంతులు గారు. ఆయనభార్య సుభద్రమ్మగారు సౌశీల్య సంపత్తిలో అన్నివిధములను ఆయనకు అనువైనది. రామయ్యపంతులు గారికి భక్తి ఉగ్గుపాలతో లభించినది. ఆదంపతులు ఎల్లప్పుడును సత్యనారాయణస్వామివారి వ్రతములు చేయుచుండెడి వారు. వారికి ఇద్దరు పురుషసంతానము, ఒక స్త్రీసంతానము. జ్యేష్ఠపుత్రుడు సత్యనారాయణ మూర్తిగారు, కనిష్ఠపుత్రుడు రామమూర్తి పంతులుగారు.

శ్రీ రామమూర్తిపంతులుగారు శ్రీ కాకుళంజిల్లాలోని 'ఎలమంచిలి' ఎష్టేటుదారు. ఆజిల్లాలో పలుకుబడిగలపెద్ద. నిష్ఠ, నియమము– ఈ రెండు ఆయన జీవితములో జీర్ణించిన ప్రధాన గుణములు. ఆయన జగమెరిగిన ద్విజుడు.

అడుగు అడుగులోను ఆయన ఒడుదుడుకులులేని జీవితమును గడపిన దిట్ట. వేషభాషలలోను, ఆచార విచారముల లోను సర్వదా ఏకైకమార్గము అవలంబించిన వ్యక్తి. ఆయనలో వాక్సంయమము మెండు. ధైర్యస్థైర్యములు గలధీశాలి. 'ప్రాణముకంటె మానమధికము' అను సిద్ధాంతమును స్వాయత్తము చేసికొనిన స్వస్థచిత్తుడు. ఆయన మానసము మానసమే. ఆయన వాక్కులో శక్తికి తగినయుక్తి, యుక్తికి తగినరక్తి గోచరించుచుండెడిది. ఆయన పేదసాదలకు పెన్నిధి. 'దేహి' అని వచ్చినవాడు వట్టిచేతులతో తిరిగిపోవువాడుగాడు. అధికార్గుల అడుగులకు మడుగులొత్తు స్వభావము ఆయనకు

ఆమడదూరమున ఉండవలసినదే. అందువలన అధికారి వచ్చి నను అతిథి వచ్చినను సమానమైన ఆదరప్రిపత్తులేకాని అం గుళముమేర వెనుకకుగాని ముందునకుగాని జరగుట యుండె డిదికాదు. ఆంధ్రప్రాంతములోని అనేకులు జాతీయ నాయ కులు ఆయనవద్దనుండి ఆర్థికసాహాయ్యమును స్వీకరించినవారే. పంతులుగారు పూర్వప్పు గంజాం జిల్లాలో జరిగిన 'నౌపడా' ఉప్పు సత్యాగ్రహములో సమస్తమైన ఖర్చు భరించిన భగీ రథుడు. దేశసేవకై తన సర్వస్వమును త్యాగముచేసిన మహా త్యాగి. ఆదర్శప్రాయుడైన కాంగ్రెసువాది.

స్నానము, సంధ్య, జపము, తపము, పూజ, పురస్కా రము, పంతులుగారికి ప్రాణతుల్యములు. ఆయన శాస్త్రీయము, సాంప్రదాయికము అయిన ఆధ్యాత్మికమార్గమున ముందంజ వేసినాడు. గొప్ప తపస్వి. అనాసక్తయోగి. భక్తి జ్ఞాన మార్గమున పురోగమించిన సఫల సాధకుడు. ముఖమునుండి బ్రహ్మవర్చస్సు ఉట్టి పడుచుండెడిది.

ఆయన 'అపకారికి నుపకారము నెపమెన్నక సేయు వాడు, దాతయే గాని గ్రహీతకాదు. వ్యవహారదక్షతమెండు. ఒకపర్యాయము నిశ్చయించుకొనిన విషయము శిలాలిఖితమే. లలిత కళలయందు ఆసక్తిగల సులలిత హృదయుడు. వేదాంత వేత్త. వాదోపవాదములలో తార్కికదృష్టి తలమానికము. ఒకప్పుడు ఆయన మనస్సు 'వజ్రముకంటె కఠిన మగుచుండె డిది. మరియొకప్పుడు కుసుమముకంటె కోమలమగుచుండెడిది. లోకోత్తర పురుషులకు ఇది సహజమేగదా!

ఆపుణ్యమూర్తికి అనురూపధర్మపత్ని మహాలక్ష్మమ్మ గారు. కాకినాడవాస్తవ్యులు, న్యాయశాస్త్రవేత్తలు, దేశసేవానిరతులు అయిన యల్లాజోస్యుల కామేశ్వరరావుగారి ముద్దుబిడ్డ ఆమె. తన వినయసంపత్తివలనను, బుద్ధిబలమువలనను, నిరంతర దైవారాధనవలనను, పరోపకారపరాయణతవలనను పుట్టినింటికిని, మెట్టినింటికిని వన్నె తెచ్చిన వనితారత్నము. ఈ పుణ్యదంపతులకు ఇద్దరు మగపిల్లలు, యిద్దరుఆడపిల్లలు. అద్వైతుల అభేదదృష్టి సూచించుటకోయన్నట్లు సాంబశివరావు, రామారావు అనియు, గౌరీనాగేశ్వరీదేవి, సీతాదేవి అనియు వీరికి నామకరణములు చేయబడినట్లుతోచుచున్నది.

“ నీచైర్గచ్ఛత్యుపరిచ దశాచక్రనేమిక్రమేణ ”

అని కాళిదాస మహాకవి చెప్పినరీతిగా కాలచక్రపుటంచు క్రిందకును మీదకునూ తిరుగుచునేయుండును. మానవునిదశ కూడ నంతియే. దుష్టగ్రహకూటము క్రూరరూపము ధరించిన కారణముగా రామమూర్తి పంతులుగారి ఎస్టేటుఛిన్నాభిన్నమయిపోయినది. అప్పుడాయన శ్రీకాకుళం జిల్లాలోని ‘మందసా’ ఎస్టేటులోని ఆరువందల ఎకరముల భూమినికొని దాని మధ్యలో ఒక గృహమునిర్మించుకుని “ రామకృష్ణాపురము” అను పేరుతో ఒక గ్రామమునకు శంకుస్థాపన చేసినారు. ఎటుచూచినను రెండుమైళ్ళవరకు గ్రామమేలేని ఆయడవిలో వానప్రస్థాశ్రమము నెరపిన బ్రహ్మర్షి శ్రీ రామమూర్తి పంతులుగారు.

వారి పిల్లలు ఊహ తెలిసినతరువాత మరొక గ్రామము నైననుచూచియుండలేదు. పొగబండి ఎట్లుండునో వారికి తెలియదు. గడపదాటి కాలు బయటపెట్టినవారు కారు. తల్లి మహాలక్ష్మమ్మగారు గురుపీఠము అలంకరించి ఆ కూనలను సాకుచు విద్యాబుద్ధులను గఱపుచుండెడిది. ఒకప్పుడు పౌరాణిక గాథలను, మరియొకప్పుడు భక్తిమార్గ ప్రాభవమును, ఇంకొకప్పుడు అతిథిసత్కారాది గుణసంపత్తిని బోధించుచుండెడిది. తల్లిదండ్రుల ఆచరణను ఎల్లప్పుడు చక్కగా పరికించు ఆ బిడ్డలకు పర్వదినములందు ఉపవాసము చేయుట, నిత్యము దైవారాధనము సలుపుట, వీనియందు మున్ముందుగా మనస్సు లగ్నమైనది. మహాలక్ష్మమ్మగారి యిష్టదైవమైన బాలగోపాలుడు గౌరీసీతలకు తనలీలలనుచూపుచుండెడివాడు.

ఈ నలుగురిపిల్లలలో సాంబశివరావు వజ్రపుతునక. రామారావు సుమనోరంజకుడు. గౌరీనాగేశ్వరీదేవి వక్రోక్తి సుధీమణి. సీతాదేవి చల్లనితల్లి. దైవబలము అందరికి సమానమే.

గౌరీ సీతలకు పూర్వజన్మ సంస్కారమువలన కవితాసుందరి తోడునీడయినది. గౌరి సీతతో కలిసి పదునైదువేల పద్యములతో 'లక్ష్మీభాగవతము' అను బృహద్గ్రంథమును వ్రాసినది. అందు వారియిరువురి కవితాకౌశలము వ్యక్తమగును. మాగౌరి మంగళగౌరి. మరి సీతయో?

## " సీతాయాశ్చరితంమహత్ "

సీతాదేవిని కేవలము సీతయనుటకంటె ' రామసీత ' అనిన సార్థకమగును. సీత రామకృష్ణాపురము వచ్చుసరికి మూ డేండ్ల ముద్దుబిడ్డ. దైవాంశసంభూతురాలు అనుటలో సందే యములేదు. అంతబాల్యమునగూడ బుద్ధి పాదరసమే.

ఆమెకు మూడవయేట కాకినాడలో పెద్దజబ్బుచేసి నది. తుట్టతుదకు జీవించు ఆశకూడ నశించినది. ఆనాటిరా త్రి ఆమెతల్లికి కలలో శ్రీ రామచంద్రుడు దర్శనమిచ్చి 'మృత్యుంజయరసము' నిమ్మని ఆనతిచ్చి 'సీతరామాయ ణము, వ్రాయనున్నది అనిచెప్పి అంతర్హితుడాయెను. ఆయౌ షధము సేవించినమీదట రోగముతగ్గి సీతఆరోగ్యముచక్క బడినది. అప్పటినుండి ఆమె శుక్లపక్ష చంద్రకళవలె దినదిన ప్రవర్ధమానయగుచు తల్లితండ్రులకును, తోబుట్టువులకును ఆనందము చేకూర్చుచుండె.

సీత పలుకులోని కులుకు, కులుకులోని సొగసు అద్వి తీయములు. ఆమెకు ఏకాంతవాసమనిన మిక్కిలి మక్కువ. అధికప్రసంగమునకు ఆమడదూరముననుండెడిది. పదిప్రశ్న లకు ఒకేఒకజవాబు. అన్నదమ్ములతో మాట్లాడునప్పుడు వారి తల నిమురుచు తన హార్దిక ప్రేమను ప్రకటించుచు మాట్లాడెడిది.

సీత కొద్ది గ్రాహకత వచ్చినప్పటినుండి నిత్యము లక్ష్మీ విష్ణు సహస్ర నామములను పారాయణ చేయుచుండెడిది. ఉపవాసాది భాగవత ధర్మములు ఆమెకు నిత్యనైమిత్తికములు. క్రమముగా 'అష్టవర్ష' అయినది. ఒకానొక శుభదినమున ఆమెకు కలలో కాళికాదేవి ప్రత్యక్షమయి "నీతల్లి నేనే" అని చెప్పినది. నాటినుండి ఆమె తనతల్లిని తన్మాతనుగా భావించి సేవించుచుండెడిది. హృదయమునకు ఒక స్థాయి, మనస్సునకు ఒక ఏకాగ్రత, పరమాత్మునియందు పారవశ్యము —— ఈ త్రిరత్నములు సీతకు మానసాత్రీతశక్తులను ప్రసాదించినవి. భగవద్దర్శనమునకు ఇవియే మూలము. అప్పటినుండి లీలామయుడైన బాలగోపాలునితో ఆటలాడుట పాటలుపాడుట ఆమెకు అలవాటు.

కవికులగురువు అయిన కాళిదాస మహాకవికి ఆ కవనేయకలకోకిలాస్వనము ఎట్లబ్బినది?

"ప్రిపేదిరే ప్రాక్తనజన్మ విద్యాః

అటులనే ముక్కుపచ్చలారని సీతకుగూడ ప్రాక్తన జన్మ సంస్కారము ఫలించుటవలన ఈజన్మలో అప్రయత్నముగా సుకవితా మార్గమలవడినది. "సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్" అనిగదా పెద్దలవాక్కు.

సీతహృదయము ఒక పాలకడలి. అందు బాలగోపాలుడు లీలలు సలుపుచు చిందులు ద్రొక్కును. అక్కడ చెప

కిన అమృత బిందువులే సీతచేతినుండి చింది రామాయణము ఆయెను. హృద్గతమైన గాథానుభూతి సంస్కారబలమువలన పరిపూర్ణాభివ్యక్తికి ప్రోవతీసెను. పర్యవసానఫలమేమి అనియా? సీతారామాయణము అవతరించుటయే.

అహ్హా!! ఏమది? ఆదీపశిఖ క్షణ క్షణ ప్రవర్ధమాన మగుచు నలుదెసలనున్న చీకటిని చీల్చి చెండాడుచున్నదే! కన్నుల మిరుమిట్లు గొలుపుచున్నది. కారణమేమి చెపుమా? మరేమియు నయియుండదు. ద్విగుణీకృత తేజో విరాజితము గదా ఆదీపశిఖ! ఎంత శోభాయమానముగా నున్నది! ... ...

... ... ఆఁ!! ... ఆఁ!!! ఇదేమి? పూర్వదిక్కాంతా ముఖము వెలవెల బోవుచున్నదేమి? తెల్లవారనుగూడలేదే! ఆజ్యోతి క్షీణించుచుండెనేమి? నాకనులకు చీకట్లు కమ్మినట్లున్నది. ఏమో. మనసులో గుబులుగుబులుగానున్నది. ఎటుచూచినను కాకిగోలయే ... రామా! ఏమి కానున్నదో నీకే ఎరుక గదా! ... ... ... ... ... ... ... ...

రామా!! సీతారామా!!! ... ... ... ... ... ...

ఆఁ!!! ఎవరిదా యార్తనాదము? ... సీతదియా? దిగుడుబావి యొద్దనుండియా? ఏమాయెనామెకు? కాలుజారి బావిలోపడినదా? 'శివశివా' ఎంతఘోరము! ఎంతఘోరము!! ... అమ్మా! సీతమ్మా!! ... ... ... ...

అచ్చపు పసుపుముద్ద వే! కన్నెత్తిచూడకున్నను మోమునుండి జీవము ఉట్టిపడుచున్నదే! ... ... సీత గోలోక

మున నివాస మేర్పరచుకొనెనా? హా రేరామ! అబద్ధము, పచ్చి అబద్ధము... ... ...నిజమా?! నిజమేనా!!! ... ... ...

క్రీ. శ. 1945వ సంవత్సరము, జనవరి 19 వ తేదీ, మాఘశుద్ధ షష్ఠి శుక్రవారమునాడు పదునాలుగేడులు నిండి నిండని వయస్సులో నూరేళ్లు నిండినందున సీ తా దే వి శ్రీరాముని సన్నిధికి చేరెనయ్యా!

"సీత ముద్దరాలు చిత్తవాక్కర్మంబు
లందు సత్యమూర్తి యమలచరిత
పుణ్యసాధ్వి విడువఁబోలదు చేకొను
రవికులాబ్ధిచంద్ర రామచంద్ర"

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

"సాహిత్యరత్న" భాషాప్రవీణ :
పిఠాపాటి సూర్యనారాయణ B. A. "భాను"
ఏ. సి. కాలేజీ, గుంటూరు.

# పండితాభిప్రాయములు



## శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు గుంటూరు

శారదా నికేతనము. 18–6–55

కీర్తిశేషురాలు గావి సీతాదేవి రచించిన సీతారామాయణములోని ప్రధాన ఘట్టములనుండి కొన్ని పద్యములు గల యీ చిన్న గ్రంథము ప్రత్యేకముగ ముద్రించబడినది. అసలు వాల్మీకిరామాయణము 24000 వేల శ్లోకములు గలది. గాయత్రీ మంత్రములోని 24 అక్షరములకు ఒక వేయివంతున 24000 గ్రంథమును రచించినాడు. చాలమంది రామాయణ కథను సంక్షిప్తీకరించి వ్రాయుచుందురు. అటులనే సీతాదేవి గారు రచించిన తెలుగురామాయణము. 40500 శ్లోకములు మాత్రమున్నవి సీతాదేవి దివంగత యగునప్పటికి బాల్యము దాటలేదు. ఆమెకు 14 సంవత్సరములు వచ్చునప్పటికి రామాయణ రచనను పూర్తి చేయగలిగినది. సీతాదేవి సంస్కృతాంధ్రభాషల సాహిత్యము నెప్పుడు సంపాదించినది? 14 సంవత్సరములు వచ్చునప్పటికి 40500 పద్యములు గల సీతారామాయణము నెట్లు వ్రాయగలిగినది? మున్నగు ప్రశ్నలు అడుగదగినవిగాని జవాబు చెప్పదగినవి కావు పరాశరుడు తల్లిగర్భమునుండి వేదపఠనము బయటికి వినబడునట్లు చెప్పినాడని, ప్రహ్లాదునికి తల్లిగర్భమున నుండగనే నారదుడు విష్ణుకథలు బోధించినాడని మనకు కథలున్నవి. మనకు చెప్పుటలేదు గాని అట్టి కథ యేదో యొకటి యుండితీరవలయును. ఈవిషయ మింతకంటే పరిశీలింప దగదు.

ఇట్టి జన్మకథ గలిగిన సీతారామాయణమును చదువవలయునను ఆతురతతోనే చదివినాను. ఇప్పుడు మనకున్న తెలుగు రామాయణములలో దేనికిని తీసిపోదు. నిజముగా యోచించిన యెడల రామాయణము ముఖ్యముగ సీతకథ గాని రామకథ గాదు.. అందులో సప్తమ కాండ కేవలము సీతాకథయే. మన కవయిత్రి పేరులో రెండు పేరులు నిమిడ్చినారు. అందులో ద్వం

ద్వ సమాసములో స్త్రీ పేరు ముందు బెట్టవలయునను నియమము కొఱకును గాదు. కవయిత్రి స్త్రీ అగుటవలన అభిమానముచేతను గాదు. కేవలము రామాయణము ప్రధానముగ సీతకథ గనుక సీతారామాయణమని పేరుపెట్టి రని ఊహించుచున్నాను.

ఇక కవిత్వమునుగూర్చి కొంచెము యోచించెదము. పై జెప్పినట్లు ఇందలి కవిత్వము ఆంధ్రరామాయణములలో దేనికిని తీసిపోదు. ప్రౌఢమయిన సంస్కృతము, జాతీయమైన తెనుగు మిశ్రితము చేయబడి యున్నవి. వెటుకుగ నుండక వంత్య ప్రాసలతో గల పెక్కు వాక్యములతో గూడిన పద్యములనేకము లున్నవి. పలుచోట్ల అర్థవంతమైన అర్థాలంకారములును గలవు. శబ్దాలంకారములు అమితమై మోటుగనుండక తగినన్ని నాజూకుగనున్నవి. కవిత్వ మెచ్చటను పేలవముగ లేదు.

మరియొక్క విశేషముజెప్పి ముగించెదను. ఆమెకు 14 సంవత్సరముల వయస్సు నిండునప్పటికి జీవితమును, గ్రంథమును రెండును ముగిసినవి. ఈలోపల ఆమె యేయూరును దూరప్రయాణము చేసి యెరుగదు. అయినను శ్రీ రామచంద్రుడు రావణ సంహారము గావించి సీత మున్నగువారితో తిరిగి ఆకాశప్రయాణము చేయునప్పుడు ఎచ్చటను దిగకనే తిరుపతి, శ్రీకాకుళము మున్నగు పెక్కు యాత్రాస్థలములను పెక్కువివరములతో వర్ణించుచున్నాడు. ఇట్టి వివరము లిచ్చుట జీవితమును యాత్రలలో గడపినవారికో, లేక దివ్యజ్ఞానులకో సాధ్యమగును గాని సామాన్య యాత్రికులకు సాధ్యము గాదు ఇది లోతుగ యోచించదగిన గడ్డువిషయము.

ఈ కవయిత్రియొక్క జీవిత విశేషములు నాకు పెక్కు దెలియవు. వీరిది శ్రీకాకుళం జిల్లాలోని రామకృష్ణాపుర గ్రామము. మర్యాదగల పెద్ద కుటుంబమునకు జెందినవారు. తండ్రి గారి రామమూర్తి పంతులుగారు. తల్లి మహాలక్ష్మమ్మగారు. అక్క గారైన నాగేశ్వరీదేవి భాషాప్రవీణ ప్రిలిమినరీ ముగించి ఇప్పుడు బెజవాడ సంస్కృత కళాశాలలో ఫైనలు చదువుచున్నది. ఈమెయు చక్కగ కవిత్వము చెప్పగలదు. ఈమె చెల్లెలు సీతాదేవితో కూడ మహాలక్ష్మి భాగవతమును, స్వయముగా వెంకటాచల మాహాత్మ్యమును

రచించెను. వీరి సోదరులు చిరంజీవులైన సాంబశివరావు, రామారావు ప్రస్తుతము ప్రకటించ బూనుచున్న సీతామహాత్మ్య భాగములు అసలు పుస్తకములలో కవ వంతు లేవు. యావత్ గ్రంథమును ప్రకటించగల శక్తి వారికి లేదు.

అట్టిభాగ్యము ఆ గ్రంథములకు కలుగజేయు గలవారి కొరకై నిరీక్షించెదము. ఈ అభిప్రాయముల జెప్పుటకు అవకాశ మిచ్చిన చి॥ కుమారి గౌరీ నాగేశ్వరీదేవికి కృతజ్ఞులము

— — —

శ్రీ జంధ్యాల సీతారామశాస్త్రిగారు
వారణాశి రామమూర్తి "రేణు" — గుంటూరు
కార్యదర్శులు: అఖిల సాహిత్య — 16—5—1955
కళాభివర్ధక ఆంధ్ర సంపత్

శ్రీ॥ శే॥ సర్వసౌభాగ్యవతి శ్రీ రావి సీతాదేవి కడు బాల్యముననే రచించిన రామాయణ కావ్యమునందలి కొన్ని ఘట్టములను చాలాభాగమువిని చదివి మహానందము పొందినాము. ఆయమ కారణ జన్మురాలు కానిచో అంత చిన్నతనమున నంతటి రసప్లుతమగురచన గావించగలుగుట దుర్ఘటము ఆమెను గాంచిన తలిదండ్రులు ధన్యులు !

" సీతారామాయణము" అను నీ అపూర్వకృతి తెలుగుభాషాసరస్వతికి ఒక అనర్ఘమణిహారముగ వెలుగొందునని మా విశ్వాసము. అభ్యాసము, వ్యుత్పత్తి కొలదిగ కొరవడినను ప్రతిభ, ధారాశుద్ధి, భావాభివ్యక్తి, పాత్రపోషణమునందలి యౌచితి, ఘటనాసంవిధానము, కథాకథన పాటవము కొదువలేక కుదిరినవి. రచనయం దచ్చటచ్చట గానవచ్చు ఛందోవ్యాకరణ స్ఖాలిత్యములు మొదటినుండి తుదివరకు తరంగాయమానముగ ప్రవహించు రసధారను అడ్డుపెట్టవు. పదునాల్గేడులు అరణ్యవాసము, లంకలో ప్రవాసము చేసిన ఆ రామసీతల వలెనే యీ రావి సీతయును బాహ్య లౌకిక ప్రపంచసంపర్కములేక తపస్వినిగా రామకృష్ణాపుర కాంతారవాసము చేసి, ఒక చక్కని మధుకోశమును సంతరించి తెలుగువారల కందించి జీవితవ్యాపారమును చాలిం

చినది. అద్దాని వంటుకొను అందరి అమృతతుల్యమగు తేని ద్రాక్షపాకపు రసిక మధుపములు.

ఈ సర్వసౌభాగ్యవతి అచ్చమైన తెలుగుబిడ్డ. మచ్చలేని తెలుగు అభిమానమునకూ, సంప్రదాయతకూ, అమాయకత్వమునకూ మచ్చుతునక! తెలుగునేల అనినా, తెలుగువార లనినా కొండంత గర్వము! శ్రీరాముడు పట్టాభిషేక సమయమున తన దర్బారులో తెలుగువారలకే మొదటి శ్రేణిలో ఆసనముల వేయించెనట! తెలుగుల గుణగణములకు మురిసి ఆంధ్ర విష్ణువుగ నవతరించినాడట! ఇట్టి హృదయాలను కదిపి కుదుపు భావములెన్నియో యీ చిట్టితల్లి హృదయాంతరాళాలనుండి వెల్లువలెత్తినవి. పుష్పకవిమానారూఢుడయి రామచంద్రుడు తిరిగివచ్చునెడ నాయన గావించు తెలుగుల ప్రశంస ఒక రసవద్ఘట్టము. ప్రతివారునూ చదివి ఆనందించదగిన పట్టు.

ఆదినుండియూ తెలుగు మాగాణము రామభక్తి బీజములకు పంటపొలముగ వెలసినది. భాస్కరుడు మొదలు విశ్వనాథవారి వరకు ఎందరో మహావ్యక్తులు అటువంటి సుబీజములను విరివిగ నాటి భక్తి ఫల రాసులను బండ్లకెత్తియుండిరి. నేటికిని ఈ ధర్మకృషి నిరంతరాయముగ సాగుచునే యున్నది. వందకుపైగా వెలసిన ఈ గ్రంథములలో దేనికిగల ప్రత్యేకత దానిది. రామాయణ రచన చర్విత చర్వణమనే ప్రశ్నకే తావులేదు. కాగా యిటువంటి గ్రంథ సందోహములో శ్రీమత్సీతారామాయణమునకు గల ప్రత్యేకత విశిష్టమైనది. ఆ రచనలో అడుగడుగునను ఆ బాలతపస్విని సాధనాసుమ సౌరభము వాశించుచుండును. ఆతల్లి వ్యక్తిత్వము తొంగిచూచుచుండును. మొల్లకావ్యము మల్లికాప్రసూనమగుచో నీ సర్వసౌభాగ్యవతి రచన శ్వేతజాతి కుసుమము. ఇరువుర అనుభూతులూ, ఆకాంక్షలూ అందు గుబాళించుచున్నవి. ఈశ్వర భక్తి ప్రసూనములు తెలుగు దైవము శ్రీ భద్రాద్రి రామునకు అంకితమైనవి.

ఇట్టి పవిత్రరచన గడ్డకు రావలసిన అవసరమెంతేని కలదు. అందలి కొన్ని భాగములు వెలుగు జూచుటతోడనే పనితీరదు. సమగ్రమగు గ్రంథము ప్రతివారలకు అందుబాటులో నుండునట్లు వెలయింపజేయుట తెలుగు

సారస్వతేయు లంకరింపఁగల పవిత్ర కర్తవ్యము. ఈ చిన్ని కృతిని చక్కఁగ నాదరించి తత్కర్తవ్య నిర్వహణమున నాంధ్రులెల్లరు తోడ్పడగల రని విశ్వసించుచున్నాము.

---

అవధానిశిరోమణి, విద్యావారిధి, 'మహామహోపాధ్యాయ'

**శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు** గుంటూరు

13—11—56

శ్రీయుతులగు రావి మహాలక్ష్మీరామమూర్తి దంపతుల గర్భమున నావిర్భవించి, తన 14 వ యేడు ముగియకముందే (ఆంధ్రమున రామాయణ మహాకావ్యమును వ్రాసి, తన సత్యలోకమున కేగిన బాలసరస్వతి సీతాదేవి, తనతలిదండ్రులకే గాక, ఆంధ్రప్రపంచమునకే, గొప్పచింత గలిగించి. మహాకవయిత్రీశిరోమాణిక్యమును గుఱించియు, ఆమె రామాయణమును గుఱించియు నా అభిప్రాయము

ఆ కవయిత్రివయస్సును బట్టి యీ కవితను విమర్శించినచో, ఆమె సరస్వత్యంశ అనక తప్పదు. పద్యములను విమర్శించినచో, కవితకు గావలసిన సొంపులన్నియు, అనేక కవుల గ్రంథములకంటె సహజములై అకృత్రిమములై, తాండవించుచున్నవి. చదివిచూడవలసినదే గాని, నాచే వర్ణింప వలనుగాదనుట, అతిశయోక్తి గాదు. మచ్చునకైన కొన్ని పద్యములను సహృదయములు కంఠస్థముల నొనర్చికొని ఆనందింతురుగాక.

క॥ అల్లెనటఁ దొల్లికుమ్మరి
మొల్లఁట రామాయణంబు మొల్లలురాలన్
జల్లగ దానినిపుడు నీ
వల్లితివఁట యెంతధన్యవమ్మా! సీతా.

మఱియు, కీర్తిశేషురాలయిన, ఆ సీతామహాకవయిత్రి, ఆమె అక్కగారగు, శ్రీమతి గౌరినాగేశ్వరీదేవియు గలసి శ్రీ మహాభాగవతమునుగూడ

వాంధ్రీకరించిరి. రామాయణము, సీతయొక్క స్వతంత్రగ్రంథము. 'భాగవతము' ఉభయకర్తృకము. ఇదియును సీతయొక్క 14 వ వయఃకాలములోనే ఆక్కగారి స్వంతపద్యములు, దుర్గాస్తవము, వేంకటాచలస్తవములుగా వెల్వడినవి.

---

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎం.ఏ.బి.యల్
హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటు ఇన్ ఇంగ్లీష్, విజయవాడ.
యస్. ఆర్. అండ్ సి. వి. ఆర్. కాలేజీ. 9—5—55

బ్రహ్మశ్రీ రావి రామమూర్తి పంతులుగారి కుమార్తెలు చి॥ సౌభాగ్యవతి రావి గౌరీనాగేశ్వరియును ఈమె సోదరి సీతాదేవియును రచించిన "లక్ష్మీభాగవతమును" విని పరమానందభరితుడనైతిని నైసర్గిక ప్రతిభగల విదుషీమణులు వీరని అవలీలగ గ్రహింపజాలితిని.

సౌభాగ్యవతి గౌరీనాగేశ్వరి పూర్వజన్మ సాధనవలన పిన్నవయస్సునందే దీక్షయందలి మహిమను గుర్తించెను. పూతజీవితమును గడపుచు, సకల సద్గుణకుటుంబియైన శారదాంబ నీమె యారాధించుచున్నది ఈమె పద్యములు లలితపదసంశోభితములై గంభీరభావబంధురములై యొప్పుచున్నవి. ఆత్మవిశ్వాసముతో సాహితీవనమున నీమె ముందంజవేయుట ముదావహము. దృష్టిలోనున్న విజయవైజయంతి ఇట్టివారి కవలీలగ లభించుట నిక్కము. ఆంధ్రశారదకు పెక్కుకయిసేతలను సమర్పించి యశస్తిలకయై వర్ధిల్లవలెనని ఈమె నాశీర్వదించుచున్నాను.

భక్తిభరితమైన ఈ గ్రంథ మచిరములో ముద్రితమై, బహుసంఖ్యాకుల కరములనలంకరించునని విశ్వసించుచున్నాను.

---

విద్వాన్
శ్రీ ఆకెళ్ల అరుణాచలశాస్త్రిగారు
సీనియర్ తెలుంగు లెక్చరరు
మహారాజ సంస్కృత కళాశాల

విజయనగరము
28—5—55

బ్రి॥ శ్రీ రావి రామమూర్తి పంతులుగారి పుత్రికామణులు గౌరీనాగేశ్వరి సీతాదేవి కలిసివ్రాసిన లక్ష్మీభాగవతమును, సీతాదేవివ్రాసిన "సీతారామాయణ" మును విని యానందించితిని. ఈ చిన్నియాంధ్ర పుత్రికలరచన లాంధ్రజాతి గౌరవములకు నిదర్శనములు. కన్నెపిల్లలు చేసిన యీ రచనలు స్త్రీజాతికి ప్రోత్సాహకరములు, సన్మార్గబోధకములు కాగలవు. ఇవి యెంతశీఘ్రముగ ముద్రితము లయిన జాతీయతాగౌరవ మంతవిస్తరించి జాతికి బోధకల్పింప గలవని నావిశ్వాసము.

---

కవిశతావధాని
కొప్పరపు సీతారామప్రసాదరావుగారు
కొప్పరపు పోస్టు,
నరసరావుపేట తాలూకా, గుంటూరు జిల్లా.

7—5—55

బ్రహ్మశ్రీ రావి రామమూర్తిగారి కుమార్తె గౌరీనాగేశ్వరీదేవి రచించిన పద్యరత్నావళి గ్రంథములోని కొన్ని పద్యములు ఆమె సోదరి కీ॥ శే॥ సీతాదేవియు రచించిన లక్ష్మీభాగవతములోనికొన్ని పద్యములు చదువగా వింటిని. రసగుళికలుగానున్నవి. సుస్వరూపమూర్తులుగా నీ సోదరీమణులు ప్రకాశింతురని యాశించుచున్నాను.

---

దర్శనాచార్య, మహోపాధ్యాయ, సాహిత్యాచార్య, ఏ. సి. కాలేజీ.
శాస్త్రవిశారద, లాక్షణికశిరోమణి, విద్వాన్, భాషాప్రవీణ గుంటూరు

## శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు 5-6-56

సాహిత్యతాపసుడనుగా నేను నేనుగా శ్రీ గౌరీనాగేశ్వరీదేవి ముఖమున దేవతాప్రసాదలబ్ధముగా లబ్ధప్రఖ్యమయిన కవితావిశేషమును ఆయా ఘట్టములందు అడిగి యడిగి వింటిని. శ్రీనామము మననమునకు మార్గమిచ్చినది. వాగీశ్వరీ పదములబట్టి నాగేశ్వరీదేవి సారస్వతారాధికల కారాధకులకు శక్తి యోగులకు వలసిన వ్యుత్పత్తిరాగమును తన ఆరాధనమున నిర్దేశించినది. ఏవం ప్రజ్ఞ దివ్యవిభూతి యని పండితరాయలని వాడు. ఇది లోకవిభూతియని లోకమనగలదు. ముద్రణమున సుశ్లిష్టమై ఒక దైవాదర్శను నీకృతి ప్రదర్శింపగలదు.

---

## శ్రీ కవిశేఖర పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు

పండితులు : హిందూకాలేజి, గుంటూరు

(పూర్ణప్రజ్ఞగ్రంథమాలా సంస్థాపకులు)

1—7—56

శ్రీమతులు గౌరీనాగేశ్వరీదేవి సీతాదేవులు శ్రీ రావి రామమూర్తిపంతులుగారి పుత్రీరత్నములు. ఈ సోదరీమణులు సహజ కవయిత్రులు. వీరుభయులు కలసి వ్రాసిన లక్ష్మీభాగవతమును, ప్రత్యేకము శ్రీ సీతాదేవి వ్రాసిన సీతారామాయణమును వీరిముఖతః కొన్నిభాగముల నాస్వాదించితిని. లలితకవిత యీ సోదరీమణుల పలుకుబడులందు వోణికిసలాడుచున్నందుల కెంతయు సంతసించితిని. సహజసౌందర్యముకలిగి కాంతిమాధుర్య సౌకుమార్యములతో గర్భవ్యమొనర్చు వీరి సరసకవిత జాతిరత్నమువలె సహృదయ సహృదయముల నలంకరింపగలదని నాయాశయము. ఆనాశ్రియుతుగు వీరి

కుదారతరు లవలంబన మొసఁగినచో సోదరీ కవయిత్రీమణులు స్వకృషి ఫలమునచిరకాలములోనే యనుభవింపఁగలరు. అట్టిమేలు వీరి కవితాకుమారికిఁ జేకూరుఁగాత. శ్రీ గౌరీనాగేశ్వరీదేవి యాంధ్రసంపత్తునఁ గావించిన కవితాగోష్ఠిలోనే నాశువుగా నుడివిన యీపద్య మీ కవయిత్రి కవితపై నాకుఁగల తాత్పర్యమును దేటపఱచునని దానినిటఁ బొందుపఱచుచున్నాను.

గీ॥ ఆసుధాధార నీకవితాసుధార
వింటినిందాక వీనులవిందుగాఁగ
వేగ భాషాప్రవీణవై వెలయుమమ్మ!
విజ్ఞకనుగాఁగ నిన్ను భావించుజగము.

———

**Sri Tenneti Viswanatham Garu,**

Maharanipeta, P. O.
Visakhapatnam
Date 29—6—55

I know late Sri Ravi Ramamurty Pantulu garu, ex Proprietor of Yellamanchili Estate, who is a well noted man. in Srikakulam District. He did a lot of service to the country since 1920. He was a congress worker and spent his all for the congress, and spent his latter days as great saint. He has got two daughters, one Smt. GowrinageswariDevi and the other Srimathi Sita Devi. Sita Devi wrote Ramayanam and both. Sita Devi and Gowri Nageswari Devi wrote Bhagavatam Residing in a lonely place with no educational Qualification, with no guidance under any teacher, except their parents. they became great poetesses. The books are very valuable The books deserve to be printed andd trust lovers of litera ture, particularly literature produced by women and girls would give all the encouragement needed by her.

The style is facile and the Verses are products of rea emotion and there is a strain of sincerity which is anessentiaè quality of good poetry.

(Sd) T. Viswanatham.

---

From ;
**Sri T. Narasimhachari,** M A. L T.,
Principal & Correspodent.

Maharaja's Sanskrit College,
Vizianagaram,
Dated 20—4—'55

Chiranjivi Gauri Nageswari Devi is known to me as student of Bhasha Praveena first-year class in this college this year. I gladly gave her admission into the class primarily because of her poetic talent besides her normal academic eligibility. She and her sister, Chiranjivi Sita Devi, are joint authoresses of a Prabandha entitled 'Lakshmi Bhagavatam' while the latter, Sita Devi, herself wrote another book named 'Sita Ramayanam' Gauri Nageswari Devi is reported by her Lecturers to be as ideal in her behaviour as high in her talents.

These two sisters are the daughters of late Sri Ravi Ramamurty Pantulu garu who was popular as Proprietor of Yellamanchili Estate and well-known as staunch congress worker, full of self-sacrifice.

It is really a matter for joy that these two Andhra Sisters though very young in age and without systematic education have reached the markof praiseworthy writers in Telugu Verse. In fact, they are gifted. I glanced through the Manuscripts here and there and found full promise of their winning,along.

with other writers, a place in the history of Telugu Poetry There may be seen some literary slips in these compositions but they are eclipsed by the naturalness and true emotion of expression observable throughout The slips can easily be se right when fair-written for print The Andhra Mahilas are to be congratulated that these sisters are their pride inthe literary field

The theme of the books is sacred and the treatment worthy. I wish that the books soon see the light of day with the sincere co-operation o er - Andhras.

) T. Narasimhachari,
Principal.

శ్రీ వేదుల వేంకటరామసోమయాజిగారు    విజయవాడ-2.

ప్రిన్సిపాల్, ఓరియంటల్ కాలేజి.    18—3—57

క॥ సీతాదేవినిఁబోలుచు
చాతురికవనంబుఁజెప్ప శైశవమందున్
భూతలమునఁగల విదుషీ
వ్రాతంబున విరళమనుట క్రీవాదేలయగున్ 1

తే॥ సహజకవయిత్రి సద్భావసౌమ్యహృదయ
విద్యలెఱుఁగక ప్రాక్తనవిద్యకతన
సరసగంభీర భావప్రశస్తిఁగనఁగ
రామచరితంబువ్రాసెను రమ్యచరిత!, 2

ఉ॥ ఆమెకు నగ్రసోదరి సముంచితప్రౌఢ, కవిత్వధుర్య శ్రీ
రామప్రసాదలబ్ధ బహురమ్య కవిత్వవిశేషయుక్తిచే
నేమముతోడ వ్రాసెను గణింపగ భాగవతంబు భక్తితోఁ
గామునితండ్రి ప్రోచుతను గౌతుకమొప్పను గౌరిదేవినిన్.

క॥ ఆంధ్రమున కవితఁ జెప్పుచు
నాంధ్రసతీలోకమునకు నాదర్శమవై
యాంధ్రావని వెలుఁగొందుము
యాంధ్ర పురంధ్రీవతంసమనఁదగి గౌరీ! 4

తే. రావివంశంబునకుఁ గీర్తిరహినిఁగొల్ప
నుద్భవించిన రత్నంబులోకొ! వీరు
వీరికవనము మహిలోన విస్తరిల్లి
కీర్తిదాయకమగుచును స్ఫూర్తిఁగనుత!. 5



శ్రీ బులుసు పట్టాభిరామశాస్త్రిగారు ధవళేశ్వరము
రాణ్మహేంద్రవరము
10—12—54

క॥ శ్రీ రావి రామమూర్తి కు
మారీ! గౌరీ! ముదంబమరనీకు మహా
శ్రీరాయురవాప్తిఁగను! కు
మారీ! నీకివె మదీయమహితాశీస్సుల్. 1

చ. అమరనదీప్రవాహమటు లద్భుతనిర్మలధార జారఁగా
నమృతరసాంబుధింబలె మహారసవత్తరమై సుగమ్యమై
యమితమృదూక్తి సంగదితమై సుమనఃస్తవనీయమైకడుం
బ్రమదముగూర్చె మీదయినభాగవతంబుకుమారికామణీ!

ఉ॥ ఆయతమై సుధామధురమై సుమనోజ్ఞవచః ప్రపూర్ణమై
శ్రీయుతమై సదాసుజనసేవ్యమునై కలుషాపనోదమై
శ్రేయదమై సమస్తజనచింతితకల్పముతావకీయరా
మాయణదివ్యకావ్య మసమానముదావహమయ్యెనేవినన్

సీ॥ పసిపాపలై శాస్త్రపరిచితి లేనప్పు
డెట్లు వ్రాసితిరో? యుత్కృష్టకృతులు
నమర ఛందశ్శాస్త్రమభ్యసింపకమున్నె
యెట్లుకూర్చితిరో? యుత్కృష్టకృతులు
నిగమాంత విజ్ఞాన నిపుణత లేకున్న
నెట్లు వ్రాక్కుచ్చితి రిట్టికృతులు
బ్రహ్మ సువిజ్ఞానపథ మెఱుంగకమున్న
యెట్లు రచించితి? రిట్టికృతులు

తే॥ నిజముగను మీదుశక్తుల నేఁదలంప
మీరు గొల్చెడు పరదైవమేను మీదు
కలమున వ్రసన సుహృత్కంజములను
నిలచి యింతమహాకృతులలవరించె. 4

సీ॥ పోతనామాత్యుని బురుడించి మఱిమింతు
రక్కజంబమరనొక్కొక్కచోట

కవిసార్వభౌము పోకలఁదలంపింతురు
నిక్కువంబుగను నొక్కొక్కచోట
సోమయాజి కవిత్వ సూటిపాటించి యా
ఫక్కిదీపింతు రొక్కొక్కచోట
భాస్కరాదుల కవిత్వమునకు సామ్యమై
యొప్పారుచుందు రొక్కొక్కచోట

గీ॥ మీకవిత్వంపుఫణితియలోక సహజ
ముక్తవిధమంతయును స్వభావోక్తికాని
యతిశయోక్తి యొకింతకాదమ్మ! మీదు
ప్రాక్కృత తపఃఫలమ్మొ గౌరీకుమారి!. 5

మా మాతృదేవత

## శ్రీమతి రావి మహాలక్ష్మిదేవి.

క॥ శ్రీరామచంద్రి చరితము
శ్రీ రాజల్లంగవ్రాసి చిరతర భక్తిన్
శ్రీరామ కరుణఁగొనఁజే
కూరెసుమీ! వంశమునకుఁగోటి శుభంబుల్. 1

సీ॥ తల్లివై సత్కల్పవల్లివై శ్రీదేవి
మీకీప్సితార్థంబులిచ్చుగాక!

భోగీంద్రవరశాయి పుణ్యభాగ్యవిధాయి
శ్రీవల్లభుండు రక్షించుగాక!
ప్రీతయై కరుణాసమేతయై మిముసదా
భారతీదేవి గాపాడుగాక!
ధీరుఁడై విఘ్నసంహారుఁడై మిముసదా
గణనాథుఁడతికృపఁగాచుగాక!

తే॥ యెల్లవేళలఁ బ్రేమ రాజిల్లు నట్లు
బాలుఁడగుచును కరుణాలవాలుఁడగుచు
భక్తవత్సల విఖ్యాతిఁబరగు దైవ
మంబుజాక్షుండు మీమొఱలనాడుగాక! 2

సీ॥ కవిజనశ్రేష్ఠు లీకావ్యమాకర్ణింప
విలసితోత్సాహులై వెలయునట్లు
కనదరిద్రులు దీనిఘనభక్తి విన్నచోఁ
దారమైకలిమిచే దూరునట్లు
దీనమానవకోటి దీని నాలించుచో
వడిగసంసారాబ్ధిఁగడచునట్లు
కడుదుఃఖభాగులీ గ్రంథమాకర్ణింప
మదినున్నవగలెల్ల మానునట్లు

తే॥ లలితములుగను ఘనసుధాకలితములుగ
హృద్యములుగాఁగ రమణీయపద్యములను
భాసురంబుగరచియించి భాగవతము
వసుధలోపల ఘనమైన వన్నెఁగనుఁడు!. 3

సీ॥ సంతతారోగ్యముల్ సర్వసౌభాగ్యముల్
మీకుండుగాక! లక్ష్మీశుకరుణ
పరహితాసక్తి శ్రీ భార్గవీధవభక్తి
మీకుండుగాక! లక్ష్మీశుకరుణ
సకల భద్రశ్రేణి ప్రకటితాద్భుతవాణి
మీకుండుగాక! లక్ష్మీశుకరుణ
సర్వార్థఫలసిద్ధి సద్గుణసమృద్ధి
మీకుండుగాక! లక్ష్మీశుకరుణ

తే॥ రాజితంబుగ భక్తివిభ్రాజితముగ
బుణ్యదంబుగ విబుధ సత్పూజితముగ
భద్రముగ మీరువ్రాసిన భాగవతము
మేటిజయమందుగాక! లక్ష్మీశుకరుణ.

తే॥ తల్లిదండ్రులమైన మాకెల్లవేళ
వఱలు సద్భక్తిసేవలు జఱపుకతన
చాలుఁసిరలను మాకు హర్షంబునయ్యె
గానమీకెల్ల శుభములుఁగలుగు గాక!.

———

శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు M. A. విజయవాడ,
ఆల్ ఇండియా రేడియో. 22—4—57

శ్రీకాకుళం జిల్లాలోని ఎలమంచిలి యెస్టేటు ప్రొప్రైటరు. కీ॥ శే॥ గాదిరామమూర్తి పంతులుగారు తపస్సంపన్నులుగా, ఉదార గృహస్థులుగా, దేవతా ప్రతిష్ఠాది సత్కార్యపరులుగా ప్రసిద్ధికెక్కి జీవితము సార్థకము చేసికొని తరలిపోయిన మహానుభావులు, ఆయనగారి సంతానములో గౌరీ నాగేశ్వరీదేవి, సీతాదేవి అనేపేళ్లతో ఇద్దరు కుమార్తెలు ఇష్టదేవతా ప్రసాదలబ్ధమైన సహజకవితాధోరణి కల్గి పదిపదునాలుగు సంవత్సరముల వయసులోపలనే, రామాయణము, భాగవతము భగవద్గీత మొదలగు మహాగ్రంథములను రచించి భగవంతున కర్పించిరి. వారిలో సీతాదేవి పదునాల్గవయేటనే విష్ణుసాయుజ్యము చెందెను. అక్కగారు గౌరీనాగేశ్వరీదేవి ప్రస్తుతము, తమ గ్రంథములను అచ్చువేయించి ఆంధ్రలోకమునకు సమర్పించవలెనని సంకల్పించి ఆ ప్రయత్నము చేయుచున్నది.

అది సఫలమగుటకు, ఈశ్వరానుగ్రహముతోపాటు, లోకుల ప్రోత్సాహముకూడ అవసరమేయగును. తమచరిత్రను, తమకవిత్వగుణమును లోకమునకు సూచనగా కొంతకుకొంత నివేదించి లోకామోదము ప్రోత్సాహజనకముగా నుండునేమో చూడవలెనని, "సీతారామాయణము" అనేపేరుతో ఈపద్యసంపుటిని ప్రకటించుటకు ఈమె ఉద్యమించెను. ఇందు, రామాయణ పద్యములుకొన్ని, భాగవతపద్యములుకొన్ని, వేంకటాచల మాహాత్మ్య పద్యములుకొన్ని, మరి యితరములుకొన్ని కలవు, వీనిలో వీఖండము చదివి చూచినను, ఈ కవయిత్రుల సహజ కవితాధార, భక్తినిర్భరత్వము ప్రస్ఫుటముగా గోచరించును. ఈశక్తియంతయు వీరిపూర్వజన్మ సంస్కార ఫలమేకాని, విద్యాసముపార్జనఫలము కాదని గ్రహించితిమేని, ఈశ్వర విలాసమునకు ఆశ్చర్య భరితులము కాక తప్పదు. అప్రకృతమైన వీరిసాహిత్యసృష్టి సమగ్రముగా ఆంధ్రులకు లభించునట్లు సహృదయులు తోడ్పడుదురుగాక.

'కవిసామ్రాట్' విజయవాడ

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు M. A. 21-4-57

శ్రీమతులు రావి సీతా గౌరీ నాగేశ్వరీదేవులు రచించిన సీతారామాయణ మహాలక్ష్మీభాగవతము లందందుజూచితిని. చక్కని శబ్దసౌష్ఠవము, చక్కని శైలి, భక్తితో నిండియున్నవి. కొన్నిచోట్ల రచన ప్రౌఢము గాకూడనున్నది

"సౌభాగ్య సర్వార్థ సామ్రాజ్య వైభవ శ్రీయుత మంగళదాయకములు" మొదలయిన పద్యములు పోతన్న గారి యడుగుజాడలలో కలవు.

"మహనీయ కాలాభ్ర మండలా స్ఫురితనీల సలలితమగు మేనిచాయవాడు" మొదలయిన రచన చేయితిరిగిన లక్షణము చూపించుచున్నది.

"ఈ నేత్రములతోడ నెవ్వరిగను గాన భువనమోహనము నీమూర్తి గాక" యన్న పద్యము భంగ్యంతరముగా పోతన్న గారి పద్యాన్ని స్ఫురింపజేయుచున్నది.

"కావ్యదోషము లెఱుంగనియట్టి నాచేత నిట్టి గ్రంథంబు వ్రాయించినావు" మొదలయినది కాసులపురుషోత్తము గారి ననుకరించుచున్నది.

రచన యెంతయు రమ్యముగా నున్నది. ఈ గ్రంథము సంపూర్ణముగా నచ్చొత్తించుటకు సత్పురుషులు పూనుదురు గాక.

---

## శ్రీ విస్సా అప్పారావుగారు M. A. గుంటూరు

2—4—57

చిరంజీవి కుమారి రావి గౌరీ నాగేశ్వరీదేవి—, కీర్తిశేషురాలైన ఆమె చెల్లెలు సీతాదేవి వ్రాసిన భాగవత రామాయణము లచ్చటచ్చట నేను వినుట భాగ్యము లభించినది. అంత చిన్నవయస్సులో విద్యాభ్యాసము, శాస్త్రపరిచయము లేనిస్థితిలో అన్నివేలపద్యములు ద్రాక్షాపాకములో వ్రాయుట కేవలము భగవత్కృపగాని మఱియొకటి కాదు. సంస్కారవిశేషమని చెప్పక తప్పదు. ఇట్టి రచనలు బహుళమగుత. వీరికి పండితులు తగు ప్రోత్సాహము నిచ్చిన నింతకంటె ప్రౌఢతరములగు రచనలకు దోహదము కాగలదు.

కవితిలక, కవితావిశారద, విద్వాన్ — విజయవాడ

**శ్రీ కాంచనపల్లి కనకాంబగారు** — 22—4—57

శ్రీమతులు సీతాదేవి, గౌరీనాగేశ్వరీదేవియును రావి సోదరీమణులు రచించిన కృతులమూడింటిని గాంచితిని. పరమానందమునందితిని.

పదునాలుగేండ్ల ప్రాయముననే "సీతారామాయణము" రచించి కీర్తిశేషురాలైనది సీతాదేవి. తన గ్రంథమందు సందర్భములుగ జేసికొని శ్రీశైలాది యాంధ్ర పుణ్యస్థలముల వర్ణించి దైవభక్తితో దేశభక్తిని మేళవించినది. గొప్పతపఃఫలమువలననే యాంధ్రవనితగ నుద్భవించుట, ఆంధ్రమున కవిత్వము అందు రామాయణముచెప్పుట జరిగినదని అప్పయ్యదీక్షితులు చెప్పినదానికి సరిపోవుచున్నది.

ఇక రెండవకృతియగు మహాలక్ష్మిభాగవతమును సోదరీమణు లియువురు జంటకవయిత్రులై రచించిరి. తల్లిపేరిట చిరస్థాయిగ దానినొనర్చి మాతృఋణము దీర్చుకొనిరి.

మూడవకృతి "వేంకటాచలమాహాత్మ్యము" (వేంకటతీతి వేంకటః కలౌ వేంకటనాయకః అన్నారుగదా. పాపభూయిష్ఠమగు కలివర్ణనము పాపరహితుడగు వేంకటేశ్వరస్వామి వర్ణనము ఇందుగలవు. శ్రీ గౌరీనాగేశ్వరీదేవి వేంకటేశ్వరస్వామిని చక్కగవర్ణించి కృతార్థురాలైనది. కవిత్వము ద్రాక్షపాకము, పండిత పామరవేద్యము. కావున శైలివిషయమునసేమి, పాకవిషయమునసేమి,కల్పనలవిషయమునసేమి తడువుకొనవక్కరలేకయే మొల్లయున్నట్లు చేసెనోక నోరు తీయవలయుచున్నది. ఈమె ఇతోధికముగ నిట్టి కృతుల వసేకము లొనర్చి, భగవదనుగ్రహమునొంది, ఆయురారోగ్యైశ్వర్యాములచే వలయుగాత.

---

కవయిత్రీమణి　　　　　　　　　　　　విజయవాడ

## శ్రీ గుడిపూడి ఇందుమతీదేవిగారు　23—4—57

చి॥ సౌ॥ రావి గౌరీనాగేశ్వరీదేవి, ఆమె చెల్లెలు సీతాదేవి రచించిన భాగవత రామాయణములను స్థాళీపులాకన్యాయంబుగ చదివితిని. అవి మృదు మధురముదను, నిర్మలముగను, నిరాఘాటముగను ప్రవర్తిల్లిన వీరి సాహిత్యసరళి సరళమై సంతోషదాయిగనున్నది. సంతృప్తితో ఈ గ్రంథ సుగంధ కుసుమములు దిగంతముల సౌరభములు వెదజల్లి వ్యాపించవలెననియు, గౌరీనాగేశ్వరికి దీర్ఘాయురారోగ్యైశ్వర్య విద్యాభివృద్ధి నొసంగి రక్షించవలెననియు, సీతారామాయణము సుధీజనస్తుత్యమై విరాజిల్లుచు, చిన్నబిడ్డయగు స్వర్గీయ సీతాదేవి యాత్మకు సంతృప్తియు, శాంతియు గలుగజేయవలెననియు, శ్రీరాముప్పను సదా ప్రార్థించుచున్నాను.

శ్రీసీతాహృదయాబ్జభాస్కరుఁడు సూరి స్తుత్యచారిత్రుఁడా
కౌసల్యాసతిగర్భరత్నము జగత్కల్యాణసంధాయకుం
డీశానార్చితుఁడైన రాముఁడు సురాధీశావనుం డెంచు సు
శ్రీ సంధాయకుఁడై కృపామతిని రక్షించున్ సదాగౌరినిన్.

---

## ……ఇంకను అసంఖ్యాకములు కలవు!

గ్రంథవిస్తరణ భీతిచే ముద్రింపకున్నాము. మా కోర్కెను మన్నించి, మా యీ గ్రంథముల పరిశీలించి, ఆదరాభిమానములతో అభిప్రాయాశీర్వాదములు ఇచ్చిన పెద్దలకు మా కృతజ్ఞతాభివందనములు తెలియజేయుచున్నాము. మా యీ గ్రంథములు ఆంధ్రుల గౌరవమన్ననలకు పాత్రములు కాగలవని ఆశించుచున్నాము.

పలాసా }　　　　రావి సాంబశివరావు.
23-4-57 }　　　రావి రామారావు B. com.

శ్రీ ర స్తు

# సీతారామాయణము





శ్రీ కాంతా హృదయేశ్వరున్ రఘువరున్
సీతాయుతున్ గేశవున్
లోకాలోక సమస్త భూతనిలయున్
లోకేశ్వరున్ శాశ్వతున్
బాకారి ప్రముఖామరావనపరున్
భవ్యున్ ప్రశంసించెదన్
మాకున్ సత్కృప సిద్ధి ప్రార్థముల స
మ్మానంబుతో నీయగన్. 1

శ్రీరామచంద్రుని జననము అయోధ్యలోని ప్రజల కందరికిఁ గన్నుల పండువ అయినది. ఈ విషయములో కవయిత్రి మనోజ్ఞముగా విరోధాభాసతో చక్కని రచన చేసినది. మఱియు తరువాతి పద్యమున బాలుఁడగు రాముని లోగల విక్రమ, గాంభీర్య, ధైర్యాది లక్షణములతో నాతని నీ విధముగా వసిష్ఠుఁడు జాతకమున నుల్లేఖించిన తీరు గమనింపఁ దగినది.

సీ॥ ముమ్మూర్తులకుఁ దాను మూలపురుషుఁడయ్యు
శిశురోదనంబులుఁ జేయువాని

విశ్వామిత్రమునింపు విఘ్నుఁడయ్యు జనయిత్రి
పావగటిల్లోపల నోదుగువాని
నాదిమధ్యాంతాదు లందని గుణుఁడయ్యు
నవయవంబులఁ బూర్తి నందువాని
నిరత విజ్ఞానమూర్తి నిలచు బ్రహ్మాండమయ్యు
జానుగ నాకారుఁడైనవాని

తే॥ మానితంబుగ జాతివిహీనుఁడయ్యుఁ
వెలఁగి భూపాలజన్మంబుఁ జెందువాని
ఘనునిఁ గనుఁగొని నవ్వుచు వనజముఖులు
కన్నులారంగఁ జూచిరి కౌరవేంద్ర.

సీ॥ విక్రమంబందున విష్ణుదేవుండన
దాతృత్వమందున ధనదుఁడనఁగ
గాంభీర్యమందున ఘనపయోనిధి నాఁగ
సౌందర్యమందున స్మరుఁడనంగ
జనరక్షణంబున వనజబాంధవుఁడు నా
నాగ్రహంబున ప్రళయాగ్నియనఁగ
ధైర్యంబునన్ హేమధరణీధరం బన
సత్యంబునన్ హరిశ్చంద్రుఁడనఁగ
తే॥ సమగుణంబునఁ బంకేజఁ జన్ముఁడనఁగఁ
బరమభద్ర ప్రసన్నత భర్గుఁడనఁగ
రమ్యధర్మంబునన్ ధర్మరాజనంగ
బరగు సత్కీర్తి వెలయు నీ బాలుఁడనిప!

సూర్యు డస్తమించినాడు. క్రమముగ ఇరులు నలువైపుల నలముకొను చున్నవి. ఉదయించిన చంద్రుని చూడనొల్లక కమలషండము ముకుళించినది. తమ సర్వస్వము దినకరుని కర్పించి యాతనినే పతిగా నమ్మిన పద్మముల కన్య ప్రసక్తియేల ? తుచ్ఛములైన భోగ్యములు పరిహార్యములు. చంద్రునికి గల బహువిధ వైభవములతో బనిలేదు. పరపురుషగతమైన సంపద నిర్మలనారీ లోకము నాకర్షింపలేదు అని కాబోలు వాని యూహ. గగన మండలమున పొడమిన శశిమండలము లోకమండన మైనది. సర్వ హృదయరంజక మై యొప్పినది. ఇట్టియూహ కవయిత్రి మృదుల హృదయములోఁ మొలకలెత్తినది.

ఆ॥వె॥ అంధకారమయము నయ్యెను జగమెల్ల
మదనగురుని కూర్మి మనుజులనఁగ
జన మనోహరముగఁ దనరారెఁ దారకా
మండలంబు గగన మండలమున. 4

క॥ భూపాలక! తలిదండ్రుల
ప్రాపునఁ గడుఁ బ్రీతితోడఁ బెరిగిరి విద్యా
ద్దీపములై సురుచిరమణీ
దీపము లమరంగ భువనదీపకు లంతన్! 5

సీ॥ పద్మనాభాబ్జ సంభవ భవాద్భుత పుణ్య
కారుణ్య మొకమూర్తిఁ గాంచెననఁగ
రజతాద్రి ఫేన మరాళ వజ్ర తుషార
ధవళంబు లొకస్త్రీఁ దాల్చెననఁగ
భువనమోహనమైన భూరి విద్యుత్ప్రభా
పుంజంబు లొకటి పెంపుఁ బొందెననఁగ

సకలజనాహ్లాద సౌభాగ్యకారణ
సులలితామృతపూర్ణ కలశమనంగ

ఆ॥ జగములెల్ల హాస్యజలధిలో మునుగంగ
మనుజకోటి చందమామ నాఁగ
పొలుపుమీరసంతసం బొసఁగుచు రాకాచంద్ర
మండలంబు గగన మండలమున. 6

కౌసల్యా సుపుత్రుడయిన రాముడు కౌసల్య యొడిలో నొదిగి ఆరోపిత బాలభావమున ప్రాకృతునిభంగి నింగినిగల చంద్రుని ఆటవస్తువుగా భావించి తల్లిని అడిగినాడు. ఆ యమ్మకు నాతని భావము ముచ్చట గొల్పినది. అబ్బాలుని కలరూపెరిగిన కౌసల్య ఆతనిలోగల హరిహరాదిభావముల వ్యక్తపఱచుచు చందమామ నందుటకు భంగ్యంతర సమాధాన మిచ్చినది. ఇచట కౌసల్యా కవయిత్రుల భావైక్య మద్భుతము. మాతృ హృదయముతో కవయిత్రి మాటాడి రాముని పుత్రునిగా భావించి మురిసియుండవచ్చు. బాలుర చిత్తవృత్తి బాగుగా భావితమైనది. రాముని చిలిపితనము నాధ్యాత్మికదృష్టితో మెలపిన విధము హృదయంగమము.

క॥ ఆటల వస్తువు కాదది
పాటించి జగంబులెల్లఁ బ్రభనొసఁగంగా
హాటకగర్భుండు గగనపు
పీటందగ నిల్పు చంద్రబింబము పుత్రా! 7

సీ॥ పాటించియాడంగ బంతులులేవొకో?
నందన! పద్మలాది నంద నేల?

గానకోని విహరింప వనములు లేవొకో?
తనయ! యీ [illegible]ని నిమ్మనఁగనేల?
వజలు నద్భుత చిత్రవస్తువుల్ లేవొకో?
కుఱ్ఱ! కంజారినిఁ గోరనేల?
మూడుభంగులునాడ ముల్లోకములు లేవొ?
యీ శీతభానుండు నాటకేల?

తే॥ భానువంశాబ్ధి చంద్రుండవైన నీకు
మాని జనవార్ధి చంద్రుండవైన నీకు
నఖిలజనలోక చంద్రుండవైన నీకు
వనజవైరిని నన్ను నిమ్మనఁగనేల? 8

సీ॥ పద్మారిఁ బొందంగ బాల! భావించితే?
పడయుమా శివరూపు తోడవునగును
తరుణేందుఁ బట్టనోతనయ! భావించితే?
పరగుమా హరిమూర్తి బావయగును
కుముదబాంధవునంద కుఱ్ఱ! భావించితే?
తనరుమా బుధలీల జనకుఁడగును
దొడ్డజాబిలినంద బిడ్డ! భావించితే?
దత్తుండవగునంతఁ దమ్ముఁడగును

తే॥ నూటి నీ రూపములనెల్ల మాటుఁ జేసి
ప్రాకృతునివోలె నేడు నీ పలుకవేల?
నిక్కమగు రూపమును బొంద నీ కడేల?
కుముదబాంధవు నో పుత్ర! కోర్కె సేయ. 9

సీ॥ కరకంకణంబుల కలరవం బేపార
నయనంబు ఱెప్పుచు నలుపువానిఁ
జనతల్లికొంగును దా హస్తమునఁ బట్టి
వేమారు చంద్రుని వేఁడువానిఁ
జన్నొండ మొలనున్న చిఱుగంటలను బట్టి
మెలుఁగు రాల్పుచు వెంట నేస్పువానిఁ
గాటుక ముఖమెల్లఁ గ్రిందుకొనంగ లో
వగచి నిట్టూర్పుల వదలువానిఁ

తే॥ జన్ను వేఁడుచు నిమ్మని ధవళమహిమ
సొంపుమీఱెడు పూర్ణేందుఁ జూచువాని
నగుచు వీక్షించి యిట్లను నందనునకుఁ
గోసలాధీశు పుత్రిక కుసుమకేశ్య. 10

క॥ చిక్కవు శ్రుతిపారగులకుఁ
జిక్కవు గురుభక్తి శక్తి సిద్ధాంతులకున్
జిక్కనివానికి నీకున్
జిక్కవలెనె? చందురుఁడిపుడు చెప్పుము? కుమారా! 11

ఆ॥ దొరకనెన్నఁ డెట్టి దొడ్డవారికినైన
గానరావ దెట్టి ఘనులకైన
నట్టి నీకు నేడు నంభోధి తనయుఁడు
వలయునే? కుమార! వలచుమాత్రి. 12

ఆ॥ నలినసానాభము తోరివ జలజగర్భుఁడు నిన్ను
నెమకి జూచ్చునప్పుఁ డించుకైనఁ
గనపడంగ మదినిఁ దనయ! భావించితే ?
వేల్పు వత్సరములు వేయిజఱుగ. 12

సీ॥ ఘనుఁడు గీష్పతి నిన్నుఁ గనఁ జూచునప్పుఁడు
నీ వదృశ్యుండవై నిల్చినాఁడ
వల నారదుఁడు నిన్నుఁ దొలిజన్మ వేడంగ
నరయ రాదప్పుఁడంచు నాడినావు,
దితిజబాధకునిన్ను దివిజులు వేడఁగా
న్వింపక నుత్తరం బిచ్చినాడ
వరయ సృష్టిక్రియంబడుగ నుద్దేశించు
దివిజులుఁగనకుండఁ దిరిగినాడ

ఆ॥ విచ్చగర్జెనేని మెచ్చెదు దాసులన్
గల్గకున్న వారి కంటఁబడవు
కుముప ముత్రిని నీవు కోరినఁ జేరఁ
దనయ! యన్ని మదినిఁ దలఁప వలదె? 13

సూర్యోదయము మగుట పద్మములు సౌంభముతోఁ బరఁడవిల్లినవి. కలువ నెలతలు కాంతతొలగి కన్నుమూసినవి. కాని ప్రజాపతి దృష్టిలో నీపక్షపాత దృష్టి యెక్కడిది? సుఖ దుఃఖము లిట్లే యుండునని చెప్పుటయా ఆతని యూహ ? కాదు, తాను తమ్మిచూలి గనుక తమ్ములపయి మమకారముచూపి నాడు. తమ్ములు తన తమ్ముని యమ్ములు, తన తల్లి లక్ష్మికి నిలయములు నగుట అభిమానించి కలువలపై నిసుమాపెన నుచునను నామము మొక్కడిది. అని స్తుతి

గర్భోపాలంభము సేసి శ్రీతత్పుత్రును చక్కని రీతిలో సుశ్వేప్రేక్షించినది కవయిత్రి.

తే॥ నలిన హితునకు దాసజనావనునకు
భక్తవత్సలమూర్తికి భాస్కరునకు
నెలమి విప్రులు నర్ఘ్యంబు లిచ్చువేళ
భానునిభ! చూడఁ గన్నుల పండువయ్యె. 14

సీ॥ తనజన్మభూమియుఁ దమ్మియౌటను బ్రహ్మ
కమలంబులకు మేలు కలిపినాఁడు
తనతల్లి నిలయంబు తామరసంబౌట
నలినోత్సవంబు లొనరించినాఁడు
తనతల్లి కరమునఁ దమ్ములు జతయుంట
చెందొగలకు వాడిఁ జెఱచినాఁడు
తనతమ్ము శాణముల్ వనజంబులౌటను
వాసివో మనకింత చేసినాఁడు
తే॥ సారసంబుల కిల మేలుఁ గోరినాఁడు
కుముదచయములకు హానిఁ గూర్చినాఁడు
విధుని మేనలుఁ డయ్యు ఘవిమలుఁ డయ్యెఁ
దమ్మిచూలియు న్యాయంబు దప్పినాఁడు. 15

క॥ వదలక ప్రతిదినమందున
మదనగురుఁ జూచి జనులు మానసమందున్
ముదమొప్ప సంస్తుతింతురు
సదయుండని కమలజన్ము సంతోషమునన్ 16

శైశవమున బ్రహ్మర్షి విద్యాభ్యాసమునకై దశరథుఁడు తమకులగురువగు వసిష్ఠుని యాశ్రమపదమునకు సపుత్రుఁడై చేరినాఁడు. ఆశ్రమప్రాంత పాదపముల సుఖనివాస మొనర్చు పక్షిగణములు సపుత్రుఁడై వచ్చిన దశరథుని చూచినవి రామాదుల సుందర విగ్రహములను జూచి కేవలము ఆనందా నంద మందినవి ఇంతకు పూర్వమే వసిష్ఠుఁడు తమకు శ్రీరాముని దివ్యగుణ ములు, ఆతని అవతారమహిమయు జెప్పియుంటచేతను వీరలలోఁగల దివ్యత్వచి హ్నముల పరికించి రాముని భగవంతునిగా భావించి కృతార్థత్వ మొందినవి. అప్పుడవి తమ నిండు మనమున సందడించిన ఆనందాతిరేకము నాపుకోనలేక మానవభాషలో దశరథుని వేనోళ్ళ పొగడినవి. ఉత్తమ గుణసంపన్నుఁడు రాముని పుత్రునిగా బడసిన దశరథుని జన్మసఫలమని పొగడ్తలోఁగల భావము. మహానుభావులగు ఋషుల్యాదుల మహిమచే పశుపక్ష్యాదులు మాటాడుట అబ్బు రము కాదు. మహామహాత్ములున్న ప్రాంతమంతయుం పూతమై యొప్పును గదా అనియూ కవయిత్రీగతమైన భావన.

క॥ ఏయూరా రెయ్యది వంశం
జేయుని నామంబు? హేతువెయ్యది మీరల్
ధీయుత! యేతెంచుటకున్
బాయని కృపఁ! జెప్పుమయ్య! ప్రస్ఫుట ఫణితిన్. 17

సీ॥ సచిహ్నలే పేరు నిర్మల చారిత్రి!
ఏ రెంత ఘనులయ్యా! శిహానవర్య!
వీరల పేరేమి వినుత సద్గుణశీల!
శ్రీకరాంశజులని మాకుఁదోచెఁ

చ॥ వితత మృగేంద్రపీఠమున వేడుక రాజసభన్ వసించు శ్రీ
కలివినయంబుతోడ విమలాబ్జదళాక్షుఁడు విష్ణుదేవుఁ డా
శ్రితవరదుండు పుష్టిసుమశేఖరుఁడై తమ''కించుచున్న నా
హితులు పలు కాలకించు నెడ నెంతటి సంతస మందితో గదా!

ఉ॥ రామ! జయాభిరామ! బుధరంజిత నిర్మలనామ! నీరద
శ్యామ! సురారిభీమ! వనసారసమిత్రకులాబ్ధిసోమ! శ్రీ
రామ!సుపుష్పదామ! యిటురమ్మనిచీరుచు నాడు నీవు "నే
నేమి తపంబుఁ జేసితి"ని యెన్ని మదిన్ దలపోయకుందువే!

చ॥ ఘనమణికుండలంబులును, గాంచనరత్న కిరీటహారముల్
తనరఁగ లేతనవ్వమరఁ దమ్ములుఁ దన్ను భజింపవచ్చి యో
జనక! యటంచుఁ బిల్చునెడ సంతసమొప్ప నృపాలరత్న! నీ
మనమునఁ బొంగి మైమరచి మాధవు లోనఁ దలంపకుందువే 24

ఆశ్రమమును ప్రవేశించి దశరథుఁడు కులగురువగు వశిష్ఠుని కెఱఁగి తన తనయులనుగూడ నమస్కరింపజేసెను. బహుభంగుల నొప్పుచున్న బాలురఁ జూచి వారి వినయాద్యుత్తమ గుణములకు మెచ్చి శిష్టుడగు వశిష్ఠుడవ్వారి నాశీర్వదించెను. మరియు సాక్షాత్కరించిన భగవన్మూర్తియగు రామమూర్తిని తదనుజులను జూచి ఆశ్రమ ఋషిలోకమంతయు ధన్యతబొందింప వారి నాతడాహ్వానించెను. బహుకాలముగా తపించి భగవద్దర్శనమునకై ప్రతీక్షించు మునిబృందము అతర్క్యతోపపన్నమగు శ్రీరామచంద్రుని మంగళవిగ్రహావలోకించి తమ తపస్సులు పండినట్లు ఉప్పొంగిరి. యిట వసిష్ఠుని వ్యాదభూమున కవ్యత్రిప్రాదణము ప్రతిబింబించినవి.

తే॥ ప్రకృతి శృంగారమంతయు భద్రిపఱచి
మించివిధి యాశ్రమంబు నిర్మించెననఁగ
మీఱు వనముల నదుల కాసారములను
ఘనతరాశ్రమ మచ్చోటఁ గనియె నృపతి. 25

ఆ॥ తనయులార! యితఁడు మనకులంబున కెల్ల
గురుఁడు రక్షకుండు వరదుఁ డరయఁ
గాన భక్తితోడఁ గరములు ముకుళించి
మ్రొక్కుఁడన్న వరుస మ్రొక్కిరప్పుఁడు॥ 26

సీ॥ సమదాళినిభములై చాలుకుంతలములు
గండభాగంబుల గంతు లిడఁగ
బాలార్కరుచులను మేలమాడఁగఁ జాలు
తనుకాంతి దిక్కులఁ దాండవింపఁ
గనువారిమనములఁ గదసిన తాపముల్
మందహాసద్యుతుల్ మఱపుఁజేయ
సహజతేజో విశేషంబు లయ్యాబ్జాక్షు
దివ్యాంశ భవులని తేటపఱుపఁ

తే॥ గదసి మ్రొక్కినట్టి కాకుత్స్థబాలురఁ
గరుణ హృదయమందుఁ గడలుకొనఁగ
భద్రవాక్య చయము భావించి పలికి దీ
వించె నవ్వసిష్ఠుఁ డంచితముగ॥ 27

సీ॥ వరశారదామృత కరసన్నిభుండగు
వాఁడు నయోధ్యాధి వల్లభుండు
సుందరాంచితనీల నీలాభుఁడగువాఁడు
దానానుసారి పద్మావిహారి
శోభిల్లు నీలోత్పలాభుఁడై తగువాఁడు
లోకైకనాథుండు శ్రీకైకసుతుండు
పదియాఱు వన్నియ పసిఁడిచాయగువాఁడు
లలిత లక్షణుఁడగు లక్ష్మణుండు

తే॥ మేటిశంపల చెలువున మెలఁగువాఁడు
సకల భద్రకరుండు నా శత్రుహంతుఁడు
మహితగుణులార! యోమహామానులార!
సుమచిరంబుగ వరుసను జూచికొనుఁడు॥ 28

చ॥ చెదరనిదృష్టిఁ జంచలతఁ జేరనిబుద్ధి ననంత మోదముల్
వదలనిభక్తితోఁ బ్రియముఁ బాయఁగరానిసుపాంగ దేహముల్
కదలక హర్షవృత్తి జడిగన్న మనోహర నేత్రపంక్తితోఁ
బమవులుగా మునీశ్వరులు పద్మదళాక్షునిఁ జూచిరయ్యెడన్ 29

వసిష్ఠునివద్ద అభ్యస్తవిద్యులై రామాదులు తిరిగి తండ్రివద్దకు వచ్చిరి. విద్యావినయసంపన్నులగు పుత్రులఁజూచి దశరథుఁడత్యంతానందభరితుండై పండితుల అంతఃపరిభాషను, గురుజనసేవ, భక్తిభావములఁగూర్చి వారితో ముచ్చటించి రామలక్ష్మణులను విద్యావిషయపరీక్షమొనర్చెను. తండ్రి ప్రశ్నావళికి సముచిత సమాధానమిచ్చిన పుత్రుల విధానము వ్యావర్ణనీయము. దేశ, మానవ, జంతు జన్మల కారణములు వారు చక్కగా వివరించిరి. జన్మఫల విష

యము బాగుగా జేసి భగవంతుడగు రాముడీ మానుషరూపమేల ధరించెను అందియు నొక బాలునకు పాటమరింప నొక బాలిక వానిని తేటపఱచినది. ఇటు కవయిత్రి బాలికా స్వరూప భావనతో భగవంతుని విలాసభావన చేసి సమ్యగ్ దృష్టితో తత్త్వరచన చేసి ధన్యయయినది.

ఆ॥ సకలకామదములు సద్బుద్ధిదములు
భుక్తిముక్తిదములు భూరిసౌఖ్య
కారణంబులమల కల్యాణకరములు
బుధుల దీవనములు పుత్రులార! 30

ఆ॥ సకలజనములకును సౌభాగ్యకారణ
మరయ ధరణి విప్రవరులసేవ
తనయులార! మీరు ధన్యయుడౌ గురుసేవఁ
జేసి ధన్యులగుచుఁ జెలఁగినారె? 31

ఆ॥ మన కులగురునొద్దఁ దనరిన సద్భక్తి
సకలశాస్త్రములను జదివినారె?
యతఁడు మెచ్చునట్టు లనుకంపఁ గనునట్లు
మహితమార్గమందు మసలినారె? 32

ఆ॥ సగుణంబు శౌరి కెంతేని జేయువ
యోగుణంబు దవ్వ నేర్పరించు
నేగుణంబు భక్తిహితసంగతంబై యుండుఁ
దెలుపుమీన్న నేను తేటపడఁగ. 33

ఆ॥ తాను గానియుండుఁ బాపు దుర్గుణముచే
వారికేగు నరకంబు మానవులకు
నీవసించి యుండుచు నిల్పు సద్గుణముచే
శ్రీరమావిభుంగు చేరనిలచు. 34

క॥ ఏమిటు దేవత్వముఁ గొను
నేమిట మానవుఁడుగాఁగ నిలఁ బుట్టును దా
నేమిట జంతువు నగు శ్రీ
రామా! వివరించి చెప్పు రాజితసూక్తిన్. 35

సీ॥ అమలుఁడై తనరారు నధికపుణ్యాత్ముండు
భాసురగతిని దేవత్వమొందుఁ
బాటింప పుణ్యపాపంబులుఁ సమమైన
నర్వీశ! మనుజుఁడై యుద్భవించు
నరయ మహాపాపుఁ డగు క్రూరచిత్తుఁడు
జంతువై తప్పక జన్మనందుఁ
బుణ్యపాపంబులుఁ బొందని మహనీయుఁ
డజ్ఞాత్ము లోక సౌఖ్యంబులందు

ఆ॥ నరవరేణ్యా! కాన నరులు శ్రీహరిపదాం
భోజయుగము భక్తిఁ బూజఁజేసి
విమల చిత్తులగుచు విష్ణులోకముఁ బొందఁ
జాలు నదియె చూడవె! జన్మఫలము. 36

మ॥ అనియీరీతిని రాఘవుండు పలుక నాస్థానలోకాలుండు చ
య్యన నొక్కండిటులాడెనట్టులగుచో నబ్జాక్షు! నీ వేలకో?
జననంబందితి మానవుండవగుచున్ సత్యంబు భాషింపవే?
యనుచో బాలిక నొక్కతిచ్చెదగదా నంతర్సమాధానమున్

అ॥ శరణమనుచు సురలు సాగి వేడిన వేళ
గరుణగావ మసలుకతన జూపె
వనజనాభుడనని మనుజుడై జన్మించి
పలుకవలెస్సుం బడగవలసెనేడు. 38

ఆ॥ అనుచు శ్రీవిశాల యను బాల పలుకుచో
జనకరేణ్యుడాది సభ్యులెల్ల
నంతనంత నగిరి హర్షధ్వనుల్ తోచె
బెల్లు రేగి దిశలు బిక్కటిలగ॥ 39

మ॥ అరవిందాప్తకులైకభూషణుడవై యాశౌరికిన్ దండ్రివై
కరుణోదారుడవై సుపుణ్యమతివై కష్టాఘ సంహారివై
సురబృందాపదబాపుచున్ ఘనుడవై శోభిల్లుచున్నట్టి నీ
వరచారిత్రము వర్ణనీయముగదా ? భావింప దేవాళికిన్ 40

ఆది జనకరాజ సభా ప్రాంగణము. నానాదేశాగత రాజన్యులు రత్నమయ భూషలతో నలంకరించుకొని బాహులుతీర్చి యున్నారు. ధనువు విఱిచిన శ్రీరాముడు సభ్యులను విస్మయమందజేసి చిఱునవ్వుతో జానకి హృదయము పులకరించి సుధను చిలకరించినాడు. క్రొత్త పెండ్లికూతురు సీతమ్మ సిగ్గులపెండ్లికూతురై నెమ్మోమున దళుకొత్త మనోభిరాముని రాముని

సమీపించి నవ్యమనూక సుపుష్పమాలతో నాతని కై సేసి మురిసినది. లజ్జావనత అయి ఉప్పొంగు సంతస మాపుకొనలేక ఆతని రూపురేఖావిలాసమును గ్రీగంట చూచి తనిసినది యా చిట్టిసీత.

శా॥ హేలాభగ్నవిశాలకార్ముకముతో హేళిప్రభారాశితోఁ
గాలాంభోధరతుల్యదేహరుచితోఁ గాంచీ కలాపంబుతో
లీలాలోకనవిస్మితాఖిల నృపాలేంద్రాదిసంఘంబుతోఁ
దా లేనవ్వుచెలంగ రాముఁడుసభాస్థానంబునందొప్పఁగాన్.

చ॥ కలితవినూత్న హేమమయకంకణ రత్నవిచిత్రభూషయై
సలలితవక్త్రతామరస సంపదమైఁ జనుదెంచి ప్రీతి న
న్నలినదళాక్షుకంఠమున నవ్యమనూకసుపుష్పమాలికన్
సులలితపాణి వైచెను, విశుద్ధపుఁగన్నుల లజ్జదేరఁగా. 42

చ॥ అళిసముదాయ నీల చికురావృతవక్త్రసరోజయై సము
జ్జ్వలరమణీయభూషణ విభాసితయైవరమందహాసయై
సలలిత సుందరాంచిత విశాలవిలోచనయై శుభాంగి యా
యలికులవేణియెత్తె ఘనమైతనరారుముఖాబ్జబింబమున్ 43

ఉ॥ కుందసుదంతమై కనకకుండలశోభితమై ప్రకాశమై
సుందరమందహాసమధుసూక్తిఁ దనర్చి విశాలఫాలమై
సుందరమై సరోజదళశోభననేత్రయుగాభిరామమై
యందముగుల్కు రాఘవుముఖాబ్జముఁజూచెధరాతనూజతాన్॥

సీ॥ బాలార్కు కిరణముల్ ప్రసరింపకయమున్నె
తెల్ల తెల్లనై చాల వెలయుమున్నె
పూర్వాద్రి యెఱ్ఱనై పొడగట్టకయమున్నె
వనజములయ్యర్కు మ్రొక్కనకమున్నె
విహగవిసరంబులు సంచరింపకమున్నె
కలకలారవములు గాకమున్నె
వనజనాశనమును మునులు గోరకమున్నె
జపతపహోమముల్ జఱుపుమున్నె

తే॥ నిక్కి పూర్వాద్రిపై జుక్క నిలచుమున్నె
పాటలాభంబునై భువిబరగుమున్నె
చక్రవాకాలి కడుసంతసించుమున్నె
నిండు వేడుకతో జనకుండు లేచి॥ 45

సీ॥ సకలప్రాణులుమున్ను సలిపినతపమెల్ల
పొందుగా నొకమూర్తి బొందెననగ
హరిహరబ్రహ్మల యద్భుత తేజముల్
పాలుపొంద నొకటియై పొలిచెననగ
భూపుత్రికెంతయు బ్రాప్తుగా దేవేంద్ర
మానినిపంపిన మణియనంగ
వైదేహికల్యాణ వైభవంబునధాత
భూపాలునకు నిచ్చుదీపమనగ

తే॥ పద్మసంఘంబు తపముల పంటయనఁగఁ
బరగు లోకత్రయంబుల భాగ్యమనఁగ
జక్కవలయంటు మ్రొక్కులఁ జొక్కసామి
పొడిచెఁ బ్రాగ్దిశసంపదంబు పొందుపడఁగ.

వివాహ శుభసమయ మాసన్నమైనది. చెలులు సీతాప్రసాధనవిధిలో సంభ్రమముతో నున్నారు. వివిధప్రభా భాసుర భూషా విన్యాసముతో నామెను శృంగారవేషోజ్జ్వలను జేసినారు. బాగుగా నలంకృతయగు సీత కల్యాణ వేదిక నలంకరించినది. జనకమహారాజు సర్వ దేవర్షిగణ సేవాలక్ష్య మగు రామచంద్రుని పాదారవిందములు పయోధారలతో బ్రక్షాళన జేసి పవిత్రుడైనాడు. ఇచట కవయిత్రియే లోకమాతయగు సీతను చక్కగా నలంకరించి యెదను వెల్లివిరిసిన భక్తి ధారలతో భగవంతుని పదద్వయి కడిగి ధన్యత వడసినది సీత నలంకరించుటలో నింకను కవయిత్రికి తనివి తీరినట్లు కనపడదు. సీతారాములకు పెండ్లిచేసి తానొక పెద్దముత్తైదువయై పరమానంద మొందినట్లు తోచును. కల్యాణ మంటపమున సుముహూర్త సమయమున సీతమ్మ ముత్యాలదోసిళ్ళ మురిపెముతో రాముని పై నుంచునపుడు కవయిత్రి సీతమ్మయును తన హృదయమున దివ్యమంగళరూప భావనచేసి “సీతమ్మ పెళ్ళి కూతురాయెనే” అని యెలుగెత్తి పలికినట్లు గోచరించును.

క. ఉరుతరరత్నపు తళుకుల భా
స్వర పీతాంబరము మేలి చంచలరుచులన్
ధరణీతనయకుఁ బ్రియమున
సిరిచెలఁగన్ దరుణిమొకతె శృంగారించెన్. 47

ఉ॥ మంకెనపూవుతోడ ననుమానములేక సమానమౌచు ని
శ్శంకగఁ బాటలాభమయిచాలగనొప్పువహింపఁదెచ్చియా
పంకజనేత్రికిన్ రవిక బంధురమొప్పనమర్చె నొక్కతే
వంకలులేక చూడ్కులకు వన్నెఘటిల్ల ఘనంపుచాతురిన్

సీ॥ బహురత్నకీలిత భారమేఖలమును
కమలాక్షిగానుకఁ గట్టెనొకతె
సౌగంధికములైన చంపకాదులఁగూర్చి
వేణిబంధంబున వెట్టెనొకతె
లలితఫాలంబునఁ జెలువుగా కల్యాణ
తిలకంబుఁ గొనగోటదిద్దెనొకతె
పల్లవాంచితములౌ పాదపద్మములందు
మెరయునందెలఁ బొందుపరచె నొకతె

తే॥ యర్ధ చంద్రుని నెకసక్కెమాడఁజాలు
బెలుకుముక్కెర ముక్కునఁ బెట్టెనొకతె
భానుచంద్రాభములుగాగఁ బరగునట్టి
కుండలంబులు చెవులకుఁ గూర్చెనొకతె. 49

సీ॥ జనకావనీపాలతనయవాల్గనులకు
నీలాంజనపురేఖ నిలిపె నొకతె
కమనీయ కింకిణీ కంకణంబులుసీత
కరపద్మముల నందపరచె నొకతె
తప్తకాంచనరత్న తారహారాదులు
నింతి కంఠంబున నిడియె నొకతె

రంగుగా నవ్య హేమాంగుళీయకములఁ
జేడియ వ్రేళులఁ జేర్చె నొకతె

తే॥ పద్మదళనేత్ర యడుగులఁ బసుపుఁబూసి
మహిమ పారాయణంబు నమర్చె నొకతె
నవ చతుర్విధ శృంగార మవధరింప
నోలి ముకురంబు చేతికి నొసఁగె నొకతె. 50

మ॥ పదియార్వన్నె పసిండికిన్ సమమునై భానుప్రభాపుంజమై
విదితంబై జగదేక సుందరమునై విద్యుత్ప్రభారాశియై
ముదితల్ జూడఁగ విస్మయావహమునై భూపుత్రి రూపోన్నతిన్
బదువుల్ కట్టివినోదలై కనుచువిభ్రాంతాత్మలై రందఱున్. 51

సీ॥ సౌభాగ్య సర్వార్థ సామ్రాజ్యవైభవ
శ్రీయుత మంగళదాయకములు
పంచమహాక్లేశ బ్రహ్మహత్యానేక
దారిద్ర్య దుఃఖ విదారణములు
రావిమహాలక్ష్మి రామమూర్త్యాత్మజ
శాలసీతావన భాసురములు
గరుడ గంధర్వ కింపురుష చారణ సిద్ధ
బుధజన బ్రహ్మాది పూజితములు

తే॥ భవ్య మునిలోక హృదయ విభాసితములు
ఘన సుభక్తౌఘ నిరత సత్కల్పకములు
రామచంద్రుని చరణముల్ రాజితముగఁ
శాటవంబున జనకుండు సీటఁ గడఁగె. 52

సీ॥ పాటలాంచితమగు పాణిని నున్నచోఁ
గమనీయ పద్మ రాగంబులయ్యెఁ
జక్కమరాళిని సోకు సమయంబునందున
లలితమల్లిక ముకుళంబు లయ్యె
మహనీయ నవరత్న మకుట సంస్పర్శచేఁ
గర మొప్ప గోమేధికంబులయ్యె
శ్యామలాంచిత దేహ సత్కాంతిచే మించి
డంబుమై యింద్రనీలంబులయ్యె
తే॥ సతత బుధలోక వినతయౌ జనక తనయ
లీల భువనైక కల్యాణ వేళయందుఁ
దనర కరయుగ్మమందు ముత్యముల నిలిపి
తోయజాతాక్షు శిరమునఁ బోయునప్పుడు 53

అల్లారు ముద్దుగా బెరిగిన రామచంద్రుడు పితృనియోగము వలన కానలకు బయలుదేరినాడు. సుకుమారుడగు రాము దారణ్యమునకు పోవ నిచ్చగింపని తల్లి కౌసల్య వగచి రామునితో దైన్య ముట్టిపడ నెన్నియో పలికినది. రాము ననుసరించు సీతను జూచి తన కోడలి భావికష్టములకు నెంతయో కుందినది. క్రొత్త కోడలికి నేర్పడిన కష్టములకు మిక్కిలి బాధపడినదియామె మనసు. తన మాతృహృదయము నిట్లు ప్రకటించినది కౌసల్య.

సీ॥ పంచభక్ష్యాన్నముల్ భక్షించు నీవెట్లు?
వనకందమూలముల్ దినెదవన్న!
పలుసౌధములలీల మెలఁగెడునీవెట్లు?
విరిపెనుగతిఁగాన దిరిగెదవన్న!

గాన కథాళ్లోలకలితుండవగునీవు
కాలమేవిధమునఁ గడపెదన్న!
తగవంచి జనులగీతముల మేల్కాను నీవు
వనమునన్లా మేల్కానెదవన్న !

తే॥ రాజరాజాధిరాజులు తేజమెసఁగఁ
కొలువ సింహాసనంబునఁ జెలఁగునీవు
ఘన మృగంబులు కొలువంగ వనములోన
నీరజాతాక్ష! యేగతి నిలుతువన్న ! . 54

సీ॥ బుధసంతతికిఁ గీడుఁబుట్టఁబోయెడిచోట
సత్యంబుఁ బాటింప సత్యమగునె?
పరహితంబొనరింప భద్రమౌనానుచు దు
ర్జనుల కించుకమేలు సలుపనగునె?
దానమెన్నఁగ మహాధన్యతయని యపా
త్రిపు దానముల సేయఁదనయ! తగునె?
యమర నహింస యుత్తమధర్మమం చాత
తాయి భద్రంబులు సేయనగునె?

తే॥ దుఃఖమునఁ దల్లి చింతాబ్ధిఁదోగుచోటఁ
దండ్రియానతిఁ బాటింప ధర్మమగునె?
ధర్మమును నన్నుఁ దలఁపని తండ్రికోర్కెఁ
గైకకోర్కెలఁ దీర్పంగఁ గడఁగితెట్లు? 55

చ. అతిసుకుమారి యీమెఁ గను మాదరబుద్ధిని మీ సుసత్కృపా
మతిఁ గనుఁ డంచు నాజనకుమారిని యీధరఁ జూపి మ
మ్మతి ప్రియభాషణాదులసమంచితపూజల నర్చె నాఁడు నీ
గతి వని కేగ నన్న విని కామిని చిత్తములోఁ గలంగదే?.

అగ్రజుడగు రామునితోఁబాటు కానలకు దానును ప్రయాణమైన లక్ష్మణుని బుద్ధికి తల్లి సుమిత్ర సంతసించినది. ఆతనినిశ్చయబుద్ధికి దోహదముగా దానతనికి బోధించినది. "పితృసమోజ్యేష్ఠ" అను విషయమును బాగుగా బలపఱచినది. లక్ష్మణునిలోని భక్తిభావమును మఱియు నినుమడింపజేసినది ఆ పవిత్ర హృదయ సుమిత్ర.

సీ॥ కను భయంకరమైన కాననమెన్నంగ
నొప్పారునట్టి యయోధ్యగాఁగ
వనమునఁ దనరారు మునిబాలకావళి
సచివులు బాంధవుల్ సఖులుగాఁగ
దుష్టశిక్షకుఁడును శిష్టరక్షకుఁడగు
రాముండు తగ దశరథుఁడుగాఁగ
పరమపావన మహాభద్ర లక్షణసాధ్వి
జానకీవనజాక్షి నేనుగాఁగ

ఆ॥ దలఁపులోనఁ దలఁచి లలితమా సద్భక్తిఁ
బడియునాలుగేండ్లుఁ బాయకెప్పుడుఁ
గొలిచి, వచ్చి, నాదు లలితమా దీవెన
భద్రమై భవములఁ బడయుమన్న! . 57

సీతారామలక్ష్మణులు అరణ్యమునకు జనిరి. సుమంత్రుఁడు తిరిగి యయోధ్యకువచ్చినాడు. రామునియెడబాటు సైపని దశరథుఁడు పడినబాధ హృదయవిదారకమైనది. పుత్రప్రేమవలన నాతడు రామునిగూర్చి తనలో నెన్నియో తలపోసినాడు. పశ్చాత్తప్తుఁడగు దశరథుని మనసు వివిధరీతుల తల్లడిల్లినది. పుత్రుని గుణగణములదలచి ఋషుల, పత్నుల పలుకులు స్మరించి శివధనుర్భంగఘట్ట మాలోకించి యెంతయో పలవించిన యాతని క్షుభిత హృదయము జాలిపలుకులు పలికినది.

క॥ కులపాంసనియగు కైకయుఁ
జలమేటికి? రామ! నీవు జను మడవులకుఁ
దొలుత ననిపలుకు నెడ నీ
తలపున నేమనుచు నన్నుఁ దలఁచితితండ్రీ!. 58

తరలము– ఘనతరక్షుమృగేంద్ర భీకరకాననంబున మువ్వురున్
జనుచు నెండకు నోడి నీడలఁజాలఘుర్మజలంబులన్
దనువుదోఁగఁగనిల్చియెండలతాపమున్గొనియెంతయుఁ
మనములోపల నెవ్విధంబున మమ్ము నెంచెదో?పుత్రకా!59

సీ॥ గగన లక్ష్మిముఖంబుఁగప్పిన చందానఁ
బెనుమబ్బులెల్లెడఁ బేర్చిపడఁగఁ
బటపటారావముల్ ఘటియించి భయముగా
నుఱుములంతంతకు నుఱుముచుండఁ
బ్రళయకాలముచేరఁ బ్రాపించెననుభ్రాంతి
ఘనశంపలెల్లడఁ గ్రిందుకొనఁగ

బ్రహ్మాండ మగలంగఁ బటుచటారవముల
బిడుఁగులంతత గుభిల్లుమనఁగ

తే॥ విసరుగాలియు జటిలమ్మయెసఁగఁ జిత్త
జల్లుగానంత వర్షంబు బెల్లుఁగురియఁ
దడసి చలిఁగొని మీరలుఁదలఁపులోన
నేవిధంబునఁ దలఁతురో? నేనెఱుంగ. 60

చ॥ వనజదళాక్షుఁ డీశ్వరుఁడు వాసవముఖ్యులఁగావనీకుఁ దాఁ
దనయుఁడునై జనించునని తాపసపూజితుఁడగ్నినాఁడు జె
ప్పినఁగడుభాగ్యమంచుఁదగుప్రేమరమావరుఁగంటిఁగంటినం
చునుబులకంబులున్నెగయఁజొక్కుచుసంతసమొందితిన్ జుమీ!

ఉ॥ అందముఁగుల్కుమోముసురుచిరాంచితరూపముబాలచేష్టలున్
సుందరమందహాసమును సొంపెసఁలారఁగఁగన్నుదోయికిన్
విందుఘటిల్ల నెంతయుఁ బ్రివీణత గంతులు నైవఁజూచి నీ
కందరు జోహరుల్ సలుపఁగన్గొనిగర్వమునొందితిన్ జుమీ!

ఆ॥ శివునివిల్లు విఱచి సీతనుసీవు పెం
డ్లాడ నఖిలజనము లరసినన్ను
ఘనునికితఁడు తండ్రియెంత ధన్యుఁడోగదా?
యనుచుఁ బెక్కుగతులననిరి రామ!. 63

క॥ అడుగును వనమునఁగల హరి
నడువడి నాతండుజెప్ప నరనాథుఁడులోఁ

గడుదుఃఖంబున మూర్ఛల
వడుఁదలఁచును వారిజాక్షు వరవర్తనముల్. 64

ఆ॥ మఱల మఱల విభుఁడు మాధవుఁడలపోసి
సూతుముఖమునందు జూడ్కి నిలిపి
"వనము కేగునప్పుడు వనజాక్షునెమ్మోముఁ
జూడ వాడదుకదా? సూత యనును" 65

రామ నిర్గమన మెఱుగని భరతు డయోధ్యలో కాలిడగనే అతనికి పట్టణమంతట విషాదచ్ఛాయలు గోచరించినవి. ప్రజలితనిఁజూచి గుసగుసలు సాగించిరి. కొందరు ప్రకటముగనే నూటిపోటు మాటలఁబలుకుచున్నారు. వాద్యములు మొఱయులేదు. వందిమాగధుల కైవారములు చూపట్టవు. పట్టణమంతయు మాటుమణిగియుండుట నాతడు కలగి తల్లియగు కైకేయి కడకేగి కారణమడిగినాడు. విషయమెఱిగిన భరతుడు తన తల్లి చేసినపనికి రోసి రామునిపై దనకుగలభక్తిని సుప్రకటమొనర్చిన పల్కులు రమ్యములు.

సీ॥ అంబ! నేనిచ్చట కరుదేర నీవేళ
మురిసి వాద్యంబులు మ్రోఁగలేదు.
రథము వీథులయందు రాఁజూచి పౌరులు
భద్రవాక్యంబులు పలుకలేదు
జనపాల సుతుడంచు మునుపోలె సాధ్వీమ
తల్లులు సేసలుఁ జల్లలేదు
మొగసాల రథమును దిగివచ్చుచోఁ జూచి
గ్రక్కున పరిజనుల్ మ్రొక్కలేదు

తే॥ దవ్వుదవ్వుల నట్లు జూచి తల్లికడకు
వీడె పోవుచునున్నాడు చూడుడనుచు
మెల్లనందురు తమలోన మేలులేదు
మానితంబైన శుభములుఁ గానరావు. 66

సీ॥ ననుఁ జూచినంతన జనములు దవ్వుగాఁ
దల్లి! వేగంబునఁ దలఁగువారు
నితఁడె కైకేయి సుతుఁడంచుఁ దమలోన
నతి రహస్యంబుల నాడువారు
తెలియనిగతి నేగుదెంచుచున్నాడు వో
చూడుడీ యని నిక్కి జూచువారు
పద్మాక్షు భక్తి ప్రభావంబు దెలియడే
యొప్పుగా నితఁడని చెప్పువారు
ఆ॥ శైశవంబునందు శ్రీశుభక్తుఁడు సుమి
మాతవలన నీతిమాలెననుచుఁ
దలఁచువారొకింతఁ దిలకించువారు భీ
షణపు దృష్టిఁ దిరిగిచన్నవారు. 67

సీ॥ మున్ జూడనేవారు మూలంబుననువారు
భరతుఁడే నిజమని పల్కువారు
మాతమాటల నింత మతిచెడె ననువారు
సందేహమేమని చాటువారు
భానుకులం బెప్డు బాగుండుననువారు
వనజాక్షుఁ డరుదేర ననెడివారు

జనని కోరిక నింతసలుపనేలను వారు
జనకుభక్తిని జేసెననెడివారు

ఆ|| భ్రాతృద్రోహమెంత పాపంబుననువారు
నదియు మీఁదఁదెలియునన్న వారు
నగుచుఁ బ్రజలు నన్ను నతివిన్నఁదనమునఁ
గనుటకేమొ తెలియఁగారణంబు. 68

ఆ|| భరత! చిన్ననాఁడు పద్మాక్షుపై నీకు
నలరుభక్తి యెందునణఁగెనేఁడు
తల్లివలన వంశధర్మంబు విడచితే?
యనుచు బాలగణము లనిరొ మఱియు.. 69

క|| పోయెద మటవికి నిక నా
తోయజపత్రాక్షుసేవ దొరకొని సేయన్
నీయెడ నీ మాతృక యెడ
మా యాత్మల భక్తిలేదు మరువకు భరతా! 70

క|| ధనకనక వస్తువాహన
ఘనమందిర మోహతతుల ఖండించి వెసఁ
జని వనములందు నీవయి
మునివృత్తియె యింకమాకు ముదము నరేంద్రా! 71

క|| పని యేమిచేయఁ దలఁచిన
జననిఁ గైకేయి నడిగి సలుపుము! యటుఁ జే

సిన నీకు శుభము నయ్యెడు
ఘనతర విఖ్యాతయశముఁ గాదె? నృపాలా!

క॥ అని కొండఱు తామాడఁగ
విని కొండఱు నగుచు నన్ను వీక్షింతురు వే
చని కొండఱు ననుఁ జూపఁగఁ
గని కొండఱు యట్టి నిలువ కారణమేమో? 73

క॥ రాముం డగ్రకుమారుఁడు
రాముఁడు ప్రాణంబు నాకు రాజ్యంబునకున్
రాముని బాయుట కోర్వను
రాముఁడె నా సర్వమనుచు రా జందరితోన్. 74

క॥ ఆ కౌసల్య సుమిత్రయు
భూకాంతుఁడు రామవిభుఁడు భూజాతయు సు
శ్లోకుఁడగు లక్ష్మణుండును
మాకులగురుఁ డట్టివేళ మమ్మేమనిరో? 75

క॥ ఎన్నఁడు ధరణీరాజ్యము
సన్నుతగతిఁ బూను తలఁపు జనియింపని నా
కున్నీవు నిటులఁ గోరుదె?
యన్నను వంచించు భోగ మదియేమిటికిన్, 76

**పంచవటిలో సీతారామలక్ష్మణులు నివసించుచున్నారు. అయోధ్యలో గల భోగభాగ్యములిచట గలవవు. అయినను గంభీరుడగు రాముడు నిశ్చిం**

తగా నిర్మలమూర్తిగఁ దోచుచున్నాఁడు. ఈ సందర్భమున నిట కవయిత్రి సరసబంధుర భావలతాంతములతో రామమూర్తిని త్రిమూర్తి స్వరూపునిగా నలంకరించి సంతసించినది. ఆతనిలో మూర్తిత్రయో పాసనచేసి అభేదభావముతో నద్వైతసిద్ధి నందినది.

ఉ॥ ప్రొద్దునలేచి శౌచమున భూరిజపాదుల నిర్వహించిమున్
గద్దియమీదనుండు హరిగైకొని దర్భలమీదనుండు నా
ముద్దియలక్ష్మణుండుఁగడు మోదమునన్దనుఁగొల్వనెంతయున్
బ్రొద్దులు శీఘ్రకాలమునఁ బోయిన భంగినఁదోఁచువారికిన్.

సీ॥ పుష్పవాటికలోనఁ బొలుపొందు గద్దియ
నలువైన పద్మాసనంబుగాఁగ
భువనైక సౌభాగ్య పుణ్యసత్కారణ
దేవేరిసీత వాగ్దేవిగాఁగ
శారికాకీరసంస్తవ్య వాక్యచయంబు
రమణీయ వేదగీతంబుగాఁగ
నాసీనులై చుట్టునలరు సన్మునిసుతుల్
ముదమున నారదముఖులుగాఁగ

తే॥ బద్మసంభవుచెలువున భద్రుఁడగుచుఁ
గన్నులకుఁ జాల పండువై కానబడును
విరులవనమును సీతతో వెలయఁజొచ్చి
చారుతరకీర్తి శ్రీరామచంద్రమూర్తి. 78

సీ॥ విమలసుస్రుల౯ జాలబెరసి వంగినలతల్
భాసురోరగపతి ఫణముగాగ
జనమనోహరముగా౯ దనరుకాసారంబు
రమణీయమగు సాగరంబుగాగ౯
బరికింపనింపైన వరజటాభారంబు
హరినీలముకుటవిస్ఫురణగాగ
భూరినానాకీర శారికారవములు
నవ్యగంధర్వగానంబుగాగ

ఆ॥ సీతలక్ష్మిగాగ౯ జెల్వారు సంపెంగ
మాలనైజయంతిమాలగాగ
రామచంద్రవిభుఁడు రమణీయమూర్తియై
కమలనయనుమాడ్కి౯ గానబడును. 79

సీ॥ విమలమై తనరారు విజ్ఞానచక్షువు౯
గనుఁగొన మూడవకన్నుగాగ
నలువొందఁగట్టిన నారవస్త్రంబులు
రమ్యేభ చర్మాంబరములుగాగ
కరమున నొప్పారు కాంచన చాపంబు
డంబుమై తగు పినాకంబుగాగ
వామపార్శ్వంబున వఱలు ధాత్రీ జాత
పుణ్యమంగళశైలపుత్రిగాగ

తే॥ కూర్మి తమ్ముండు నాషణ్ముఖుండుగాగ
వరశిరోమణి చందురువన్నెగాగ
శైలరాజ శిఖరాన సంచరింప
శూలి నారామచంద్రుఁడు చాలియుండు. 80

రామ తిరస్కృతమైన శూర్పణఖ యెంతయు నలిగి అవమానము భరింప జాలక రామునకు సీతావియోగ మేర్పడజేయ సంకల్పించినది. దానికి దగునట్లు రావణునితో జెప్పి సీతపై నాతనికి మోహదృష్టి కలిగించుటకు నామెనుగూర్చి పలుతెఱగుల వర్ణించి చెప్పినది.

తే. సురవిమర్దన! జనమనోహరముగాగ
భవ్య కస్తూరి తిలకంబు ఫాలతటిని
లలికళాధరు బురుడింపనిలుపుగాని
ఘనునిముఖచంద్రునకు కలంకంబులేదు. 81

సీ॥ సకల సౌభాగ్యోరు సదనంబు వదనంబు
భద్రింబునకుఁ జాల ప్రాప్తు జూపు
పద్మోత్పల స్తుతి పాత్రముల్ నేత్రముల్
మేటికోయిలపాట మెలతమాట
సరసిజ శోభా ప్రశస్తముల్ హస్తముల్
కారుణ్యఘృణ్యా స్పర్ధనము మనము
పల్లవ పాటలాభరణముల్ చరణముల్
వరమత్త మధుకరవరులు కురులు

ఆ॥ అతివమందహాస మఖిలతాప వినాశ
కారకంబు దురిత హారకంబు
వేల్పుసతులకన్న వెలఁది యెంతయు మిన్న
నాతి కెన్నియున్న నడుము సున్న. 82

సీ॥ జనకు వాక్యమున రాజ్యంబు వీడుటెగాని
సహజసుజ్ఞానముల్ వదలలేదు
భూతకారుణ్యంబు బుద్ధిఁ బూనుటెగాని
మనవారి చంపుట మానలేదు
యసురుల మర్దింప నానఁబూనుటెకాని
పొలుపొందు మునివృత్తిఁ బూనలేదు
సకలంబు దానయై సంచరించుటెగాని
నిశ్చలత్వంబున నిలువలేదు

ఆ॥ గుణము నొకటికాదు గుణముఁ లుండుటలేదు
కలవొ? లేవొ? మనకుఁ దెలియరాదు
వానివలనఁ గీడువచ్చు దైత్యేశుల
కౌనర నీవు మారకుండితేని? 83

రావణుఁడు సీత నపహరింపదలచి మారీచుని మాయామృగము కమ్మని చెప్పినపుడు రాముని భగవంతునిగా నెఱిగిన మారీచు డాపనికి నియ్యకొనక రావణునికి సీతారాముల తత్త్వస్వరూపమును సభక్తికముగా నిట్లు తెలియ జెప్పెను. ఆ తరువాత పద్యమున రాముని మృగయావినోదవర్ణన మున్నది.

సీ॥ నరుఁడుకాఁడాతండు నారాయణుఁడుగాని
సౌమిత్రి నరుఁడె శేషాహిగాని

సీత మానవికాదు శ్రీదేవియేకాని
ధనువుగాదది మేటితనువుగాని
బాణంబులవిగావు పన్నగాలములుగాని
యదికోపమా? పరిశ్రమాప్తిగాని
శోకగాదది శీఘ్రభూమిస్పృశ్యముగాని
జయమునుగావిటమీఁద భయముగాని

తే॥ శౌరి బాధించుటిదికాదు చావుగాని
గెలుపుఁ గైకొనఁగాదు తలఁపుగాని
దైత్యహంతతోడ నూరక తగవులేల?
భావనముసేయుఁడీ! మీఁద భద్రమగును. 84

సీ॥ సకలాశ్రియుండౌచు సాగిన రఘురాముఁ
డలసి భూజంబుల నాశ్రయించు
గురుయోగిమానస గుహలఁగుమ్మరు మేటి
శైలేంద్ర గుహలందు సంచరించు
దాససంతాపముల్ తలఁగించు భవ్యుండు
దాహ తాపంబు నానూఢఁగొనును
భక్తకామదుఁడన్నఁబరగు పద్మాక్షుండు
పటురయంబున లేడిఁ బట్టఁగోరు

తే॥ బంధహరుఁడను సత్కీర్తిఁ బరగుశౌరి
తిరిగిచి మాయామృగంబు బంధింపఁజూచు
జనకజాతకుఁ బ్రియమును సలుపుకొఱకు
మునిజ నార్చితుఁడగు హరి వనముసొచ్చి. 85

దుర్మార్గుడైన రావణుడు సీతను లంకకుదీసికొనిరాగా నాతనితమ్ముడగు విభీషణుడు సీతను లోకైకమాతగా నెరిగినవాడుగాన అన్నకు నట్టిపనికూడ దని సీతారాముల స్వరూప వైభవములజెప్పినాడు. ఇట్టికూడనిపనులవలననే ఇక్కట్లు వచ్చినవి. పాపాయ పరపీడనమ్మనియు బోధజేసినమాట లెంతయు ధర్మప్రతిపాదకములు.

సీ॥ రాజిల్లినాఁడవు రాజీవభవుని స
త్కరుణావైభవములు దనరుచుండ
దీపించినాఁడవు దేవవత్సరములు
నాకభోగంబుల నవ్యశక్తి
విరచించినాఁడవు విరివిగా వేదముల్
సకలలోకంబులు సంస్తుతింప
భాసిల్లినాఁడవు భ్రాత! వైశ్రవణుని
తమ్ముండు నాఁగ సుద్దండకీర్తిఁ

ఆ॥ బరఁగు సకలవేద భావార్థములునెల్లఁ
దెలియు నీకు మిగులఁ దెల్లముగను
పాపమనఁగ నేమి? పరపీడనంబె కా
దైత్యనాథ! మదినిఁ దలఁపవేమి? 86

సీ॥ అన్న కిన్నరనాథు నటు పారఁద్రోలుటఁ
బరులచేఁ జావశాపంబువచ్చె
నరయంగ దివిజుల కపకార మొనరింపఁ
దల వ్రయ్యలగునన్న పలుకువచ్చె
గర్వించి జగధీశు కైలాసమెత్తుచో
మధ్వరిచేఁ జావ మాటవచ్చె

మునివర్యులకు ద్రోహము జేయుచుండుటఁ
బాలుపొందు శుభములుఁ బోవఁజొచ్చెఁ
తే॥ దలఁప శ్రీదేవికిని నెగ్గుదలఁచియుంట
గలుగు సౌఖ్యచయములు నడఁగఁజొచ్చెఁ
ఇత్తెఱంగున నిసుమంత చింతనెవ్వ
కులవినాశంబు సాక్షింపఁదలఁచితెల్లు? 87

సీ॥ అన్నవైభవము నీకన్నులు కుట్టినఁ
దపముఁ జేసెదనన్న తలఁపు కలిగెఁ
దపమునకు మెచ్చి ధాత వరంబీయఁ
బ్రిభువరంబనెడు గర్వంబు కలిగెఁ
బ్రిభువరంబనెడు గర్వంబుకల్గుటఁజేసి
మాన్యుండనేననుమాట కలిగె
మాన్యుండననుచు దుర్మానంబు వాటింప
చెలఁగి వేల్పులఁగెల్వతలఁపు కలిగె
తే॥ వేల్పులను గెల్చు భావంబు వెలయుకతన
ఘోరదైత్యులతోడును గోరవలసెఁ
గుత్సితాత్ములసఖ్యంబు కూర్చెనింత
దనుజవల్లభ! నిన్ను నేమనఁగరాదు, 88

రావణాపహృతయగు సీతకై కుందిన రాముని డెందమతిమృదులము. ప్రాకృతునిమాడ్కి పలవించిన ఆతనిమాటలు జాలిగొల్పును. భార్యపైగల ప్రేమచే నాతడు లక్ష్మణుని యెన్నివిధములుగనో అడిగినాడు. ఈతని వియోగ

వ్యథాతిశయాభివృద్ధి నొందినది. ఎండకన్నెఱుగని సీత కంటకాకీర్ణమైన కాననకు వచ్చుటేమి? ఆమె రావలదనినను వచ్చినది. గురుజన సేవాపరాయణయగు సీత అయోధ్యలో నుండుట సమంజసము. ఆమె అచట నేయున్న ఇట్టి యిక్కట్టులు వచ్చియుండెడివి కాదుకదా! ఇట్టిభావవితతి మనసునలమినది సీతావృత్తాంతము తనకుజెప్పువారే లేరాయె! అతని దుస్సహదుఃఖము దుస్తరజలధియైనది. ఇట కవయిత్రి సహృదయుని హృదయమును కదలించి కరగించి బాష్పార్ద్ర మొనర్చినది.

సీ॥ పుష్పముల్ కోయంగఁ బోయెనో? లక్ష్మణ!
జలజాక్ష! యటు సీత జాడ లేదు
వనవిహారముఁ జేయఁ జనియెనో? లక్ష్మణ
జగదీశ! యటు సీత జాడ లేదు
వెస ఫలంబులఁ దేర వెడలెనో? లక్ష్మణ!
జననాథ! యటు సీత జాడ లేదు
ముని కన్యకలఁ జూడఁ జనియెనో? లక్ష్మణ!
సత్యాత్మ! యటు సీత జాడ లేదు
ఆ॥ యెచట నుండెనొక్కొ? యెటుల నుండెనొ గదా?
మహితశీల యటవి మధ్యమందు
నీవనంబునంద నీప్రాంతముననుండు
సీతకొరకు క్షితిఁ జెందవలదు. 89

క॥ వలదనుచును వనికి నిటురా
వలదంచును బెక్కుమార్లు పలికిన నెపలన్
దలఁపవు మదిలో నింతయుఁ
దెలిసెగదా నేటిదిగులు దీనత్వంబున్ 90

సీ॥ ఎండవానలజాడ కింతయోర్వవు కాన
వనజాక్షి! వనికిరావలవదంటిc
క్రూరదైత్యాసిక ఘోరసత్త్వంబుల
బాధలు పెక్కులుcబలికియుంటిc
కులప్రాజ్ఞ కౌసల్యcగొలిచి యయోధ్యలో
నే వచ్చునందాక నిలువమంటి
మమతననద్భక్తి గురువర్గములకెల్ల
విలసితపూజc గావింపుమంటి
తే॥ నీరజాతాక్షి! గృహమున నిలువమంటి
జనకనందన! నాపల్కు సలుపమంటి
వనమునందునc బదునాల్గు వత్సరములు
వడిగc జెల్లించియటుమీద వత్తునంటి. 91

క. జలజాక్షి! నీదు సేమముc
దలcపంగా జరిగినట్టి తద్వ్యథమెల్లన్
గల భంగి మాకుcజెప్పం
గలిగిన సద్బంధుcడింకcగలcడో? లేcడో?. 92

క. ఇందాక నీ యారణ్యము
సుందరతా కల్పవృక్షశోభితముగు నా
నందనవనమని తోచును
సందియ మొక్కింతలేదు చంద్రనిభాస్యా!. 93

క॥ శోకము కార్యవినాశని
శోకము ఘనబుద్ధి ధైర్య శోషణ మఘమున్
శోకము సంతత నింద్యము
శోకముఁ జేకొనఁగఁదగునె? శోకవిదారా! 94

సీ॥ తల్లికౌసల్యకుఁ దగవచ్చి మ్రొక్కుచో
భూసుత రక్షణఁ బూనుమనియె
ఘనత సుమిత్రి దీవనముల నిచ్చుచో
ధాత్రీజ రక్షణఁ దప్పకనియె
నెంతయు నత్రిమునీశ్వర వ్రాతంబు
వెడలుచో రమఁగావ విడువకనియెఁ
గుంభజుం డచట వీడ్కోలుఁ గావించుచో
మానిని నొక్కింత మఱువకనియెఁ

తే॥ దగ జటాయువు వసమునఁ దన్విఁజూచి
యీమె నొంటరి విడువకు మిచటననియె
నందరందురు జనకజ నరయుమనుచుఁ
దలఁప వనజాక్షికే కీడుఁ గలిగెనకట? 95

సీ॥ సలలితభక్తిఁ గౌసల్య సేవించుచుఁ
జెలువుగఁ బురిలోన నిలుతువేని?
ఘోరదైత్యానీకక్రూర కర్మంబుల
నింతైన మదినిఁ జింతింతువేని?
నా విక్రమంబు నీనాఁడుఁ గన్నులఁ జూచి
భయమున లక్ష్మణుఁ బంపవేని?

రామునకుం గీడురాదు నిక్కంబుగంచుఁ
బలుకు లక్ష్మణుమాటఁ దలఁతువేని?

తే॥ విమలచారిత్రి! నామాటవింటివేని?
నీరజాతాక్షి! గృహమున నిలుతువేని?
నేఁడు కీడు జనించునే నీకునాకు
ననుచుఁ జింతించెమది నలినాక్షుఁ డధిప! 96

ఉ॥ వెంటియు నేత్రియుగ్మమున వీరచరిత్రుఁడు బాష్పపంక్తు లొం
డొండజనింపఁ గ్రోధమున నోజనకాత్మజ! పంక్తికంఠు ను
ద్దండభుజాబలంబునను ధాత్రిజనుల్ వెఱఁగందిచూడ నా
చండశరాలిద్రుంతునిటసాక్షిసుమీ!కులవల్లభుండనున్. 97

ఉ॥ క్రూరకిరాతవర్గములుఁగొట్టఁగఁ దామరుదేరజూచి యో
శూరచరిత్రి! రామ!యిటుచూడుమటంచునుబల్కుపక్షిలే
నీరజనేత్రి! దానవుఁడు నీ కపకార మొనర్చునప్పుఁ "డో
వారిజనాభ!రక్ష!"యనిపల్కుచునన్ వడిఁజీరకుందువే? 98

ఉ॥ వారిజబంధురానన! యవారితశక్తి సురేంద్ర దేవతా
నైరిరణంబునన్ విహగవల్లభునిన్ దునుమాడి వేగ వి
స్తారమహోగ్రదర్పమున దక్షిణదిక్కున కేగి యోగి యా
నీరధి దాటిపోవునెడ నీమది నేమి తలంచితో కదా? 99

ఆ॥ దైత్య మర్దనుండు తమ్మునితోఁ గూడి
వచ్చువాఁడు దైత్యవనునిఁ దునుమ

సుగుణపుణ్యశీల! వగవంగవలదని
పలుక నచటలేదు బాంధవుండు. 100

సీ॥ జనకాజ్ఞనేవేళ నొసరించుదీక్షలో
నిండిన పితృభక్తుండనేని?
ధర్మ రక్షణము నధర్మ శిక్షణమును
విమల చిత్తమునఁ గావింతునేనిఁ?
బహుల సేమంబు లో భావించి నిరతంబు
సకల కర్మంబుల జరుపుదేని?
నను లోన శరణుగా నమ్ము సద్భక్తులఁ
జెలఁగి సత్ప్రేమ రక్షింతునేని?

తే॥ దాసజన తాపచయముల దలఁగఁ జేసి
యిష్ట కామ్యార్థముల నెల్ల నిత్తునేని?
దనుజనాయకుఁ డుంచిన వనములోన
నొందు బాధలు నినుఁ బొందకుండుగాక! 101

**లంకకేగిన కపిపుంగవుడు ఆంజనేయుడు, రాముడుచెప్పిన చిహ్నలతో సీతను గుర్తించినాడు. కాని విన్నదనముతో కన్నవారిని కలతపెట్టు ఆమె ముఖమండలము పాణిపల్లవకయ్యపై వాలియున్నది. ఉపవాసములచే తను వల్లరి కృశించినది. రామచంద్రుని నామస్మరణచే కంబుకంఠము గాద్గద్య మందినది. సంతతబాష్పధారాకులమైన కనుదోయి ఆంజనేయుని వ్యాకులుని జేసినది. మించుకాంతులమించు సొంపుగలసీత నేడార్తయై అతనిమనమున కార్తి కల్గించినది. భరింపరాని వేదనతో నాతని హృదయము తల్లడిల్లినది.**

సీ॥ రామాఖ్యఁ బాయుట రాజితంబై తగు
వదనపంకజమున వాడుఁదోప
నతికోమలంబులై యలరారు చెక్కులు
గన్నీటి వఱదలఁ గాంతిఁ దఱుగ
నుపవాసముల డస్సియుండుట దేహంబు
వాడిన ఘనలత వడువుదోప
సరసమౌ శ్రీరామ సంస్మరణంబుచేఁ
గంఠంబు గాద్గదికంబుఁ గొనఁగ

ఆ॥ జడలుగట్టు వేణి గడలిన చింతతో
నున్నదాని నజునిఁ గన్నదాని
జనకరాజ సుతను గనియె నాతండటఁ
గన్నుదోయి నశ్రుకణము లొలుక. 102

క॥ రాముఁడు చెప్పిన చిన్నెలు
భామామణి కమరెఁ జాల భాసురములునై
యీ మెలఁత రాముదేవియ
నామది సందేహమేల? నమ్మగనయ్యెన్. 103

ఆ॥ అరయ నీమె సొమ్ములా సొమ్ములునుమును
వైభినట్టి పటము వనితపటము
నొక్కరూపకాన నిక్కంబు శ్రీదేవి
యిందు సందియంబు నొందనేల? 104

సీ॥ పూర్ణచంద్రునినైన బురుడింపదే కాని
నెమ్మొగంబునఁ గాంతి నేఁడు లేదు
క్రొక్కారుమెఱుఁగులఁ జక్కఁదిద్దదె కాని
నెమ్మేన ఘనరుచి నేఁడు లేదు
లలిపల్లవము భ్రాంతిఁగలిగింపదే కాని
నిండఁ జేతులసొంపు నేఁడు లేదు
వనజలక్ష్మికి నిండువాసమై తగుకాని
చూడసంఘ్రులపెంపు నేఁడు లేదు

ఆ॥ అజునిపీఠమిచ్చి యలరింపదే కాని
సుదతికరుణ కిప్పు డదనుకాదు
దాసకోటి ఘోరతాపమార్పదె కాని
వెలఁదినగవుకిప్పుఁడు వేళగాదు. 105

చ॥ జనకజయాజికోడలు విశాలపవిత్రచరిత్ర దేవతా
జనమునివందనీయ గుణసంపద కెంతయుఁ బట్టుకొమ్మ స
జ్జన నవకల్పకంబు నిజశక్తిఁ దలంపక శాంతవృత్తి దు
ర్జనుల సహించె రాఘువుని శక్తి జగద్విదితంబు సేయఁగన్.

సీ॥ పుట్టిననాఁడహో భూరిగ్రహాదులు
గోర్కెమున్నిద్దగాఁ · గొనియెనేని
విబుధులబాధింపవెడలుచో నావేల
ఘనులకోపాగ్నిచేఁ గ్రాగెనేనిఁ
గడుగర్వ మమరంగఁ గైలాసమెత్తుచో
మదనారివ్రేగున మ్రగ్గెనేని

బలిఁజూడనేగ నప్పుదాత్మజ్ఞుఁడంతఁ దా
నైచు వేగంబున వడియెనేని?

తే॥ జంఘగతినింద్రితోఁ బోరి చచ్చెనేని
వాలివాలంబు హతినాఁడుఁగూలెనేని
సిదురాత్మకుచే సీతకింతయగునె?
యక్కటా! దైవమటు సేయదయ్యెఁగాక.

సీ॥ పాణి పల్లవశయ్యఁ బవ్వళించెనుగదా?
తనరారు చెక్కుటద్దంబు నేఁడు
మలినాంబరాదుల మఱితాల్చె నేకదా?
జనకరాజకుమారి జనని నేఁడు
సచ్చిదానందంబుఁ జాలఁదప్పెనుగదా?
తరలాక్షి చిత్తంబు తలఁప నేఁడు
వికచాంబుజమువోలె వెలసియుండదుగదా?
కమలవాసిని నెమ్మొగంబు నేఁడు

ఆ॥ దేవకాంతలెల్ల సేవింపఁదగుకాంత
అసురీసమేతయయ్యె నేఁడు
భక్తరక్షణంబు పరిప్రధానముఁ జేసి
నిజము లోకజనని నిలచె నేఁడు.

రామరావణ సమరమున నిర్వక్ర పరాక్రమ మిరువైపులఁ జూపట్టినది. కయ్యమునకుఁ దలపడిన రామరావణులను కవయిత్రి చక్కనితీరులో వర్ణించినది. [illegible] గిరిగిరులు పెనగినచందమున [illegible] వర్ణించుట

మనోహరము. బాణధారాసంపాతమిట్టు సమిత్సముచితరీతి నుల్లేఖిత స్త్రై రొప్పియున్నది.

మృగనాథుండు కరీంద్రుఁడున్ మహిమలక్ష్మీనాథుడున్ గేశియున్
నగచాపుండు గజాసురుండు ఘనుఁడానా కేశుడున్ వృత్రుఁడున్
దగఁ గ్రౌంచఘ్నుఁడుఁ దారకుండు ననిలో దర్పించు చందంబునన్
దిగధీశుల్ వెఱఁగందఁ బోరిరని శ్రీ దీపింప రామాసురుల్.

సీ॥ మహనీయ దోర్దండ మండిత బలులౌచుఁ
గరిరాజయుగ్మంబు బిరుదుఁ జూపి
నిర్వక్ర విక్రమ నియతి నేపారుచుఁ
గంఠీరవంబుల ఘనతఁ జూపి
బహుపటుత్వంబు దుర్వారగర్వ మెసంగ
వల వృషభేంద్రుల బలముఁ జూపి
యమర నద్భుతమునౌ సమర కౌశలముచే
ఖగరాజయుగళంబు తెగువఁ జూపి

ఆ॥ సురలు నసురవరులుఁ జూచి విభ్రాంతులై
గలగఁబడఁగ వెగడుఁ దలకొనంగ
రామచంద్ర విభుఁడు రావణాసురుఁడును
బోరి రద్భుతముగ ఘోరవేంద్ర!

క॥ అలిగి దశాస్యుఁడు హరిపైఁ
బలురకముల నారసములుఁ బరిపిన హరియున్

జలదము మెఱుఁగుఁ గలిసినట్లుగ
సలలితగతి నమరునగము చాలుప్పనఁదోఁచెన్.

క॥ సురభీకరుఁడగు దశకం
ధరుఁడు రమాధీశుతోడఁ దలపడిపోరన్
బరికించువారికెల్లను
గరిహరితోఁ బోరుసేయుకైవడిఁ దోఁచెన్.

క॥ దనుజుని బాణచయంబులు
తనువున నాటంగ రక్తధారలు నెగయన్
వనజాక్షుఁడు గడునొప్పెను
ఘనముగఁ గెంపమ్మి దండఁ గైకొన్నకరియన్.

క॥ హరివైరి హరియుఁ దలఁపడఁ
బరికించినవారికెల్ల భయదంబగుచున్
గిరి గిరితో హరి హరితోఁ
గరి గరితోఁ బోరుసేయుకైవడిఁ దోఁచెన్.

సీ॥ ఘన బాణతతులు నల్గడల గ్రమ్మినవేళఁ
బందిరి యందంబు బట్టుకొలుపు
వాడితూపులు లీలవరుస లేర్పడువేళ
వరిమొనల్ నాటెడు వరుసఁజూపు
నరుమగ పైపైనఁ గురియుచో క్రొక్కారు
మబ్బువానలదైన మహిమఁదెలుపు

కనుభీకరంబులై క్రిమ్మెను నెత్తుర
నేపాఱు పిడుగుల యేపుసూపు

ఆ॥ రామచంద్ర విభుఁడు రావణాసురుఁడును
జాపకౌశలమున నేపురేగి
బహు నిశాత ఘోరభల్లజాలంబుల
భూరి నైపుణమునఁ బోరునప్పుడు.

రావణాంతకుఁడై రాముఁడు సీతనుదోడ్కొని పుష్పక మధిష్ఠించి అయోధ్యకు పయనమైనాఁడు. విమానయానమున అధస్థలమున గన్పట్టు ప్రదేశములెన్నియో ఆ పవిత్రదంపతుల కానంద సంధాయకములైనవి. నదీనదములు పుణ్యతీర్థక్షేత్రములు పల్లెపట్టణములు, పర్వతారణ్యములు మొదలగునెన్నియో రాముఁడు సీతకుజూపినాఁడు. అయ్యై ప్రదేశముల పూర్వము తాను సీతకైపడిన పాట్లామెకు దెలిపినాఁడు.

ఈపరిచయక్రమము కవయిత్రియగు సీతమ్మ పఠితల హృదయమున స్పష్టముగా నచ్చొత్తినది. భావుకుల హృదయమున నీదృశ్యము ప్రత్యక్ష గోచరమేయయి భావికమైనది. దేశమెఱుగని వారినైతము పుణ్యనదులఁ గ్రుంకులాడించి యత్తుంగ పర్వతాగ్రములజూపి హరిహరదేవతా సందర్శనమున పునరావృత్తి రహితుల జేసిన దనిపించును.

ఈమె మనలవెంటనిడికొని రామేశ్వరమున రామలింగేశ్వరుని దర్శించి శ్రీరంగమున రంగధాముని సేవించి, మధురలో మీనాక్షినీక్షించి, కంచిదేవుని పంచకొంచెమాగి, తిర్పతిదేవుని తీర్థప్రసాదములతో కాళహస్తీశ్వరు కరుణ బొంది కిష్కింధలోన గ్రహారికులజూచి, ఋష్యమూకము దాటి విజయవాటిక లోని కనకదుర్గాంబను కాంక్షదీరగొలిచి కృష్ణాగోదావరుల గ్రుంకులాడినది.

పిదప త్యాగ్యసీమకుజేరి ముక్తేశ్వర, ద్రాక్షారామ, కోటిపల్లీ, సింహాచలంబుల హరిహరుల భక్తినై సేవించి సూర్యదేవుని కరుణతో వరలుచున్న అరసవల్లిగో గొంత విడిదిసేసి తనకు జన్మయిడిన రామకృష్ణాపురము చేరినది.

పుణ్యదంపతుల దనగృహమున కాహ్వానించి మాతాపితృ సోదర సమేతముగా పూజించి సీతారాములు అనుగ్రహమంది మనలగూడ ననుగ్రహింపజేసి నట్లున్నది.

విశిష్య తెలుఁగుభాషలోని తీపిదనము రామునకు చవిచూపినది. రుచి మరిగిన రామునికోర్కెపై దాను రామాయణము తెలుఁగున వ్రాసి యాతనికే అంకితమొనర్చి ధన్యయైనది యీమె. అక్కతన కాబోలు రామునికి ఆంధ్ర ప్రదేశముపై పెద్దమమతయేర్పడి తానాంధ్రనాయకుడుగా నవతరించినాడు. తనభక్తురాలు రావిసీతమ్మ వ్రాసిన రామాయణము తానువిని సీతకు వినిపింప నుత్సహించినాడు కనుకనే రాముడు లంకనుండివచ్చి తిన్నగా రామకృష్ణ పురము విచ్చేసి పీఠమిడినాడు.

ఉ॥ అంగన! చూచితే? యెదుర నద్భుతలీలఁ గనంగవచ్చు స
త్సంగము నిత్యభాసుర సుధాకరతాపస దేవతా మనో
రంగము భక్తహృత్కమల రాజితభృంగము సర్వకల్మషో
త్తుంగతమఃపతంగ మలధూర్జటి లింగము రామలింగమున్.

మ॥ జనరక్షార్థము భారతీ విభుఁడు మున్ సర్వామర శ్రేణితో
ననుఁబ్రార్థించినఁగాదు నాకకృపమై నాడీవునుఁదోడరా
వినుతశ్రీ బుధసంతతిన్ మనుపఁగన్ విఖ్యాతిఁగైకొన్నయీ
ఘనశ్రీరంగముఁ జూడుసంతసమునన్ శృంగారమాలప్రియా!

మ॥ బుధసంఘాలికి వాసమై నిగమ సంపూర్ణ ప్రభా భాస్వమై
విధిముఖ్యామరకోటివేడఁ గరుణన్ విఖ్యాతి శ్రీగౌరి స
న్మధురాలోకన లీలవచ్చినిలువన్ మాన్యంబునై యొప్పునీ
మధురాపట్టణమీవుచూడుమదె? సమ్మానంబునన్ మైథిలీ!.

చ॥ వనజభవుండుమున్ను సురవర్గముతోఁ జనుదెంచి భక్తిమై
జనవున వేడ నేను, గిరిసంభవయున్ బరమేశుఁడున్ గృపన్
దనరఁగవచ్చిభక్తజనతండముఁగాచుచునుండ నెంతయున్
ఘనతఁజెలంగు నీపురము కంచియనన్ దనరారునుగ్మలీ!.

చ॥ దురితవిహారులై విపులదుష్టమతిన్ ఖలులై చరింప నీ
ధరణితలంబునన్ జటులతాపభయాదులు విక్రమింప నే
నరుదుగ శేషశైలముననందఱఁగావఁగ నిల్చినాఁడ! నా
దిరుపతి నాప్రసిద్ధిఁగొనుతీర్థము దీనినిఁజూడు! జానకీ!.

శా. ఈశానుండు గిరీంద్రజాసహితుఁడై యేవేళపాపౌఘముల్
క్లేశంబుల్ గొనకుండనాత్మపదభక్తింబ్రోల్చుపుణ్యాత్ములన్
శ్రీశైలంబుననుండి గావఁగడురాజిల్లున్ మహాశక్తి నా
శ్రీశైలంబననొప్పు శైలమదియే శీతాంశుబింబాననా!.

చ. చెలఁదియునాగమున్ గజముఁ జేరికిరాతుఁడుభక్తిపెంపునన్
బలు తెఱఁగుల్ భజింపనొకభంగినిఁ గైకొని నిండుభక్తవ
త్సలతనుజూపెనాడిచటసాంబశివుండుఁగృపామయుండు నా
ఔలుపగుఁ గాళహస్తియను సిద్ధపదంబు జగత్ప్రసిద్ధిగన్.

సీ॥ నిత్యరక్షితభక్త నికరుఁడై తనరారు
వర విరూపాక్షు సత్కరుణచేతఁ
బంపాసరఃపుణ్య సంపదున్నత ఝరీ
పావన మహనీయ పటిమచేత
ఫలపుష్ప పల్లవ భారమనోల్లాస
తరుశోభితారామ తతులచేతఁ
గమనీయ నవరత్న ఖచిత గోపుర మహా
ప్రాసాదసౌధ వైభవముచేత

తే॥ రమ్యగుణులైన వానరరాజిచేతఁ
దనరు శుకపికవిహగ సంతతులచేత
సలలితంబుగ నాంధ్రరాష్ట్రంబులోన
మహిత కిష్కింధ వీక్షింపుమా మృగాక్షి! 123

చ॥ అనవిని సీతచూచిముదమంది 'రఘూద్వహ! వానరాంగనా
జనములఁబిల్వఁ బంపు, మనసారసలోచనుఁ డాజ్ఞ సేయ వే
చని రవిజుండు నంతిపురచంద్రనిభాస్యలతోడవచ్చి శ్రీ
వనదనిభాంగునానతిని వాసిగఁబుష్పకమెక్కెనయ్యెడన్.

ఉ॥ రాజితలీల పుష్పకము రమ్యతరంబుగఁ బోవఁ బోవ సీ
తా జలజాక్షి కిట్లనియె దైత్యవిరోధి ధరాజ! చూడు! వి
భ్రాజిత పుండరీకము విరాజిత సంతతకిన్న రీకముః
ధీజన వాసయోగ్యతరు దీప్తమశోకముఋష్యమూకమున్.

సీ॥ తనరంగనిచ్చటఁ దరణితనూజుతో
సఖ్యంబుఁజేసితి సారసాక్షి!
వీక్షింపనిచ్చట వినుముట్టఁ బెరిగిన
తాలముల్ కూల్చితి శీలచరిత!
చర్చింపనిచ్చట సౌమిత్రితోఁగూడి
నీకుగా వగచితి లోకవినుత!
భావింపనిచ్చోట భద్రచారిత్రుఁడీ
యనిలాత్మజుఁడు మమ్ముఁగనియె నతివ!

తే॥ మించు సద్భక్తినన్ను మెప్పించినట్టి
శబరిఁగాంచితి నిచ్చోటఁ జారువదన!
తివిరి లక్ష్మణుభక్షింపఁ దిగియుచున్న
ఖలుకబంధునిఁ ద్రుంచితి సులలితాంగి!. 126

తే॥ భాసురంబుగ నిందాద్రి ప్రార్ధనమున
భక్తరక్షణ దీక్షను బరగియున్న
శైలపుత్రిక వెలసె నీశైలమందు
కనకదుర్గాంబ నాఖ్యాతివనజ వదన!. 127

క॥ ఇచ్చోట వాలిఁగూల్చితి
నిచ్చోసుగ్రీవుఁ గరుణనేలితి వినునే
నిచ్చోట నిలిచియుండితి
నిచ్చ శరత్కాల దర్శనేచ్ఛ జనింపన్. 128

ఉ॥ పాపమునాకనోదనుజపాలుఁడుసీనిట్టుఁగోంచుబోవఁడాఁ
గోపముతో విహంగపతి ఘోర రణంబొనరించి నీల్గి సం
ప్రాపితమోక్షరాజ్యజయబంధురుఁడయ్యెనతండుధన్యుఁడై
జ్ఞాపకమున్నె? నీకు నవసారసనేత్రి! జటాయు వెన్నఁగన్.

సీ॥ రాజతంబుగ నాంధ్రరాష్ట్రంబమహిలోనఁ
బుణ్యతీర్థంబునై పొసఁగు కతన
లలితమై తనరారి తెలుఁగుభాష తలంప
వినమనోహరముగా వెలయుకతన
రత్నంబులో త్యాగరాజసత్కీర్తనల్
నిండారవినువేడ్కలుండు కతన
రావి సీతాంబ విభ్రాజితంబుగనాకుఁ
దెలుఁగుకావ్య మొసంగఁదలఁచు కతన

తే॥ నాంధ్రులసనాకునిష్టంబునైన కతన
జారుతరకీర్తి నాంధ్రరాష్ట్రంబులోన
నాంధ్రనాయకుఁడనుపేర నలరు దచట
రాజతాంచిత పరిపూర్ణ రాజవదన!. 130

క॥ ఇదిరొ జనస్థానంబిట
పదివేవురు దైత్యవరులు బవరముచేయన్
గదియంగనాఁడు దునిమితి
నిది తలపుననున్నె? నీకు నిందుని భాస్యా!. 131

ఆ॥ దురితకర్ముఁడైన సురవైరి చెలియలి
ముక్కుసెవులుఁగోసె మున్నిచట

మొలఁత! నీవుచూచి మేలని కొనియాడ
లలిత లక్ష్మణుండు లక్ష్మణుండు. 132

తే॥ కనకమ్మృగమాచు నిచటకుఁగౌతుకమున
నసుర విభునాజ్ఞ మారీచుఁడరుగుఁదేర
నీవుకోరినఁ దునిమితి నిమిషమంద
చారు పరిపూర్ణ సత్కళా చంద్రవదన!. 133

క॥ ఘనముగ గోదావరితరి
మునిహితమగు వృక్షరాజి ముంగల మృగముల్
జనవున నీడకు నిల్చెడు
మనకట్టి పర్ణశాలమానిని! కంటే?. 134

ఆ॥ తనశిరంబుమీద మనలనిల్పఁగఁగోరి
తలఁపునందు నొండు తలఁపులేక
తగుసమాధియందుఁ తన్మయుఁడై యున్న
వాని భద్రమేరు సూనుఁజూడు!. 135

మ॥ "క్షణమందుఙ్బరమేశుఁగొల్చినతులైకై వల్యముఙ్గోరద
క్షణముఙ్గైకొనునట్టియీవరమువేగఙ్గూర్చవే!" యన్ననా
గుణరత్నాకర బోయకాంత కిడమా?గుప్తంబుగానాఁడునా
క్షణముక్తేశ్వరమీవుచూడుమదె శ్రీ తన్మ్మదేవతాపుత్రికా136

మ॥జలజాప్తప్రియుఁడాదిశంకరుహరుఙ్సర్వేశుఁబాల్గ్రింపమా
కులభర్తఙ్బ్రియమారఁజూచిశివుఁడాగుహ్యాంబికాయుక్తుడై

ఫలసంధాయిని గౌతమీతటమునఁ భక్తావనాదీక్షతో,
గలిదోషంబులఁబాపుచుండునిదె ద్రాక్షారామమబ్జాననా!.

ఉ॥ ఒప్పెడుకోటిలింగములకొక్కటితక్కువయయ్యెఁగాశియై
తప్పక యెల్లవారలకుఁదాపహరంబు శుభప్రదంబునై
గుప్పలుగాగ సౌఖ్యములఁగూర్చుచునుండునుగోటిపల్లినాఁ
జెప్పెడిదేమి? వింతలు విశేషములుండు సరోజలోచనా!.

క॥ సత్యము తప్పక భక్తుల
నిత్యము రక్షించి వరము నిజముగనొసఁగన్
సత్యేశుఁడనఁగనిట సం
స్తుత్యుఁడనై వెలసినాఁడఁ జూడుముఁసీతా!. 139

మ॥ నరసింహాకృతినాఁడుదైత్యతనయున్రక్షించుచోనాంధ్ర లీ
గిరిపై నిల్వుమటంచు భక్తియుతులై కీర్తించి ప్రార్థింప స
త్కరుణాలోకనతోడ భక్తవరులన్ గాపాడుచున్నాఁడ సీ
నరసింహాచలమీవు చూడుమదె భూనారీ శిరోరత్నమున్

సీ॥ సకలరోగంబుల సంహారింపఁగఁ జాలు
వరకల్పవల్లివో యరసవిల్లి
నిఖిలేప్సితార్థముల్ నిండారసమకూర్ప
గురుకల్పవల్లి వో యరసవిల్లి
సకలసంతాప సంసారవారధిఁ దాట
యతి కల్పవల్లి వో యరసవిల్లి

మ్మానిత మోక్ష సామ్రాజ్యలక్ష్మి నొసంగ
నలకల్పవల్లి వో యరసవిల్లి

తే॥ నిఖిల సౌభాగ్యములఁగూర్చు నిశ్చయముగ
నర్క-నిలయంబు కాన మా యరసవిల్లి
భద్రముల తల్లి సిరులకుఁ బాలవెల్లి
యరసవిల్లి నిజంబు కాంతామతల్లి! 41

ఉ॥ రావికులప్రదీపకుఁడు రమ్యుఁడుజానకి రామమూర్తినాఁ
బావనకీర్తి శాలి మనబాలిక సీతకు తండ్రితాత గా
రీవరు నాదిశంకరుఁబరేశ్వరు నిల్పెజగద్ధితంబు సం
భావనఁజేసి యీ కవితెఁ బద్మదళాయతచారులోచనా!.

క. గౌరీనాగేశ్వరుఁడన
గౌరవతరభక్తి జనులు గణుతింపంగా
గౌరీయుతుఁడై నాఁడిట
గౌరాంగి! సమస్త భువన కళ్యాణముగాన్. 43

సీ॥ భాసుర శిఖర విభ్రాజితంబులు నొచు
చెలువొందు పర్వత శ్రేణిచేత
వివిధపక్షి విచిత్ర విహగ కోలాహల
రంజితవర వృక్షరాజిచేత
మానిత జంతు సంతాన వాసిత లతా
ఛారునికుంజ పుంజమ్ములచేత

నందగోప కిశోర నానావిధాశ్చర్య
సంచార పుణ్యంపు సరణిచేత
తే॥ కాశి రామేశ్వరాదుల గడసి చూచి
యనయమును వచ్చుయాత్రిక జనముచేతఁ
జాలనొప్పెడు రామకృష్ణాపురంబుఁ
గమలలోచనముందర గంటెనీవు! 144

సీ॥ జలజాక్షి! యీతఁడుఁదలఁప భాసురకీర్తి
రాజితగుణవర్తి రామమూర్తి
ధాత్రిజ! యీమె సీతనుఁ దల్లి శ్రీలక్ష్మి
కాంతామతల్లి సత్కల్పవల్లి
భూనుత! యీ బాలపుణ్య సద్గుణజాల
గౌరి నావర్తించు ఘనసుశీల
వనిత! యీతండు పావనమహోద్భుతధర్మ
సారవై భవుఁడువో సాంబశివుఁడు
ఆ. రమణి! బాలుడితఁడు రావిరామారావు
భూరిసుగుణశాలి పుణ్యమూర్తి
కాంచుమెదుర నిన్నుఁగడుభక్తి సేవించు
పరమసుగుణపూత బాలసీత. 145

మ. ఘనచారిత్రముప్రాసిభక్తియుతమైమాన్యాత్మయైధన్యయై
మునునాకర్పణఁజేసి సత్ప్రియమునన్ మోక్షంబకాంక్షించునీ
జనసంపూజిత నిత్యనిర్మలమతిన్ సౌమ్యవ్రతోద్భాసితన్
ఘన చారిత్రను బాలసీత నిచటన్ గంటే! సరోజాననా!.146

అదిగో రామరాజ్య సమున్మేషమునకది నాంది. సర్వప్రాణి మనోరథ సుప్రభాతము. నాఁడు అశేష ప్రజల డెందములు వికసించినవి. శ్రీరామచంద్రుని పట్టాభిషేక మహోత్సవము ఎట్టిప్రత్యూహములులేక కన్నులపండువుగాఁ గన్పట్టినది. మంగళతూర్యములు మాటిమాటికి ప్రజాహృదయముల పులకింప జేసినవి. దేవతలు సయితము తమఇక్కట్టులు గట్టెక్కినట్లు తలచి పుష్పవృష్టితో బాటు ఎన్నియో గానకళ లర్పించిరి. వివిధ భూషాభూషితుఁడగు రాముడు సీతాసమేతుఁడై బంగరుగద్దె నధిష్ఠింప సోదరులు సేవింప, రాచచిన్నెలతో, దనరువాతని పరిపూర్ణనీల పయోదకాంతిని ఈయింతి కవయిత్రిసీత కన్నులారఁ జూచి కమనీయ కవిభావములం గవిత గూర్చినది.

క॥ మానిత సింహాసనమున
దానవజనమర్దనుండు తద్దయుదనరెన్
భూనాయక! పూర్వాద్రిని
భానుఁడుఁగను పట్టునట్లు భాసురుఁడగుచున్. 147

తే॥ అంబుజ జ దత్తఘన కిరీటంబువాఖ్య
నలరధరియించి యొప్పారెనా విభుండు
భువన సామ్రాజ్య భారంబుఁబూనియున్న
దేవతాపాలు గరిమంబు దేటపడఁగ 148

క॥ తనరఁగ జనకజ పార్శ్వం
బున మెఱయఁగ రామవిభుఁడు పొందుగ మెఱసెన్
ఘనసౌదామని సంగతి
జననుత! చెలువొందినట్టి జలదము వోలెన్. 149

క॥ పాకారిదత్త ఛత్రము
శ్రీకరముగ నొప్పమీఱఁజెలగెను హరియు
న్నాకాద్రి వేయుపడగలఁ
బ్రాకటముగ నొప్పుతొంటి భంగిఁదలిర్పన్. 150

క॥ పవనార్పిత చామరముల
భువనాధారుండు శౌరి పొల్పొందెఁగడున్
సువినిర్మల సంపదమై
నవశారద మేఘపంక్తినభ ముంబోలెన్. 151

క॥ హరదత్త కార్ముకంబును
గరమునఁదగఁదాల్చి యొప్పెఁగంజాక్షుఁడుదాన్
సురవల్లభ చాపంబును
సురుచిరముగఁదాల్చు నభముసొంపున నధిపా!. 152

క॥ వారిధిదత్త ఘనాంబర
ధారుండై తనరుశౌరి తగనొప్పారెన్
వారిజహితు కాంతులచే
నారయగాఁ దూర్పుకొండ యలరిన మాడ్కిన్. 153

తే॥ సురసమర్పిత భూషణ శోభమీఱి
రామచంద్రుడు తనరారె రమ్యుఁడగుచు
రమ్యనవరత్న వరహేమ రాజిచేతఁ
జెలఁగు గట్టులరారాజు చెలువుదాల్చి. 154

సీ॥ లక్ష్మణు కెంగేలి లావణ్యాఛత్రంబు
దివిరి రాకాచంద్రు ధిక్కరింప
భరత శత్రుఘ్నులు పట్టుచామరములు
మిన్నేటి తరగల మేలమాడ
వామభాగమునందు వఱలు భూమీసుత
సౌదామనీ కోటి సాటిఁజూపఁ
గమలరాగము డంబు కౌస్తుభపతకంబు
మార్తాండుమూర్తికి మారుపడఁగ
తే॥ బాలచంద్రుని బురుడించు ఫాలతటిని
లలితకస్తూరికా ఘనతిలక మొప్ప
భక్తవత్సల సత్కీర్తిఁబరగియున్న
రామచంద్రుఁడు రాజిల్లె రాజసభను.

సీ॥ మానితశ్యామాయమాన మోహనమూర్తి
కందర్పశతకోటి కలిమిఁజూప
మహనీయ నవరత్న మకరకుండలకాంతి
గండభాగంబులఁ గ్రిందుకొనఁగ
హాటకమణి జాలకోటీర నవరుచుల్
గగనాంతరాళముఁ గౌగలింప
సలలిత మందహాసద్యుతుల్ దిక్కులఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురణఁగొలుపఁ
తే॥ గన్నుఁగొలకుల నిండారు కరుణతొలఁగి
మేలిమైఁ నల్లనల్లన జాలుఁగొనఁగ

భువనమోహనసౌందర్య పుణ్యమూర్తి
రాజితంబుగనొప్పె శ్రీరామమూర్తి. 156

క॥ వారిజ గర్భాదులు సుర
చారణ గంధర్వయక్ష సాధ్యాదిజనుల్
వారణ వక్త్రాద్యమరులుఁ
బోరనఁగురియించి రపుడుఁ బువ్వులసోనల్. 157

సీ॥ రహింమించె రంభాది రాజాననలయాట
భాసిల్లె గంధర్వపతులపాట
చూపట్టెరవికిని సుందరంబగుకాంతి
లలితమై జగతిపై నిలచెశాంతి
తోరమయ్యె సుపర్వ భూరితూర్యరవంబు
నొప్పారె ధరణి మహోత్సవంబు
కలిగెనెంతయు మేలికలిమి భూస్థలిఁగానఁ
గురిసెనెంతయుమింట విరులసోన

తే॥ ఘనులహృదయంబు లెంతయుఁ గడుఁజెలంగ
వఱలబుధకోటి తాపముల్ వడిఁదొలంగ
సకలలోకైకనతుఁడు శ్రీ శంభునుతుఁడు
భూభరంబును గృపతోడఁబూనునాఁడు. 158

సీ॥ అనుకూల పవనంబు లానందముగ వీచె
నంఛిత గతిఁ బ్రవహించెనదులు

ఆమనివిభవంబులందె నాయావనుల్
సూరిలోకంబున శుభములమరె
ధర్మంబు నాల్గుపాదములఁజెన్నలారె
వేదగానంబులు వెలయనొప్పెఁ
ప్రభుకోటిలోనైక్య భావంబురాజిల్లె
ఖలవృత్తివర్తింపఁగలిగె భయము
ఆ॥ తగశుకాది నుతులుదనరారె బాల బా
లికల భక్తిగాన నికరమమరె
రామచంద్రవిభుఁడు రాజీవనేత్రుండు
ధరణి భరములీలఁదాల్చె నపుఁడు. 159

మ॥ జననీవాక్యమునీకృపామహిమయుఀ సత్యంబుపాలింపగఀ
దనుజధ్వంసనదీక్ష! నీకరుణ సీతాదేవినే భక్తి నీ
ఘనచారిత్రము వ్రాసితిన్ గరుణమైకైకొమ్మ! లేలెమ్ము! స
జ్జనులుఀ బండితకోటిమెచ్చఁగగృపన్ సంరక్షఁగావింపుమీ!

క॥ దేవాదిదేవ! రఘువర!
భావజ సదృశవిలాస! భద్రప్రద! నిఀ
భావించి వ్రాసినానిటఁ
గావుము! నాతండ్రి! తప్పుగలిగెడు నెడలన్. 161

సీ॥ కావ్యదోషము లెరుంగని యట్టినాచేత
నిట్టిగ్రంథంబు వ్రాయించినావు
యనవద్య హృద్యంబులగు పద్య గద్యముల్
సూరిలోకము మెప్పఁజూపినావు

దివిజసంతతికైనఁ దెలియనినీరూప
మంచితకృపను జూపించినావు
భక్తవత్సలకీర్తిఁ బాటించినీవు నా
యీప్సితార్థంబుల నిచ్చినావు
తే॥ చేరి మమ్మెల్లవేళ రక్షించినావు
భక్త సత్కల్ప బిరుదంబు బట్టినావు
సకలబుధజనపక్ష! విశాలవక్ష!
పంకజాతాక్ష! నిఖిలసద్భక్తరక్ష!. 162

క॥ బాలను నినువినుతింపని
జాలని నేనరయ నీదు చరితమువ్రాయన్
జాలుట కృతినీకొసఁగుట
నీళాపతి! వాసుదేవ! నీకృపగాదే?. 163

క॥ నీపదము లఖిలజనసం
తాపౌఘ నివారణములు తాపస నుతముల్
పాపాదిదుఃఖ హారములు
నాపాలిటి కల్పకములు నళినదళాక్షా!. 164

ఉ॥ కోరిక నన్యమేమియును గోరుటలేదు సరోజనేత్ర! నీ
తారకనామమున్ సతము ధన్యతనొందఁగజిహ్వపైన సు
శ్రీరమణీయమై తనరఁజేయఁగదే! యదిచాలుచాలదే?
నీరజనాభ! సన్నిలయనీరధి! దాశరథీ! కృపానిధీ!. 165

మ॥ భవదుఃఖాబ్ధిఁదరించితిన్ దురితముల్ భస్మంబుఁగావించితిన్
భువిసత్కీర్తులనించితిన్ గుణములన్ బూర్ణంబుగా,మించితిన్

దివిజుల్ కానని మిమ్ముఁ గంటిఁ గృతి మోదింపంగ నీకిచ్చితిన్
భవదీయాదర సత్కటాక్షమున నోభద్రానుసంధాయకా!

సీ॥ నీరజపత్రాక్ష! నీవె తండ్రివి మాకు
లోకమాతృక సీతమాకుతల్లి
నీభక్తజనములు నిజమైన బాంధవుల్
నీకటాక్షంబు సుశ్రీకరంబు
నీనామచింతన నిఖిలపాపహరంబు
నీపైనభక్తి సమ్మోదకరము
నీపాదయుగ సేవ నిక్కమభీష్టంబు
నీకథాకథనంబ నిత్యజపము

తే॥ నిన్ను నిత్యంబుఁ జూచుట యెన్నమాకు
ఘనచిదానంద సంధాయకంబు చూవె
చిరశుభాకార! నిత్యలక్ష్మీవిహార!
రామ! రాఘవ! శ్రీరామ! రామ! రామ! 167

పోతనవలె ఈకవయిత్రి యీ కృతికర్తృత్వము భగవంతునిదనియే పలికినది. భగవత్ప్రేరితమై పలికిన పలుకులు కమనీయ బంధబంధురమగు కావ్యసరణి నందినవి. నిరీహయై విశ్వశ్రేయమే కాంక్షించి దివ్యభావనా లతికల నికుంజము కూర్చి అందు దివ్యమూర్తి రామమూర్తిని కనులపండువగా నీక్షించి పూజించినది యీమె. నీలమేఘమును నెమ్మిచందాన రాఘవదర్శనమున నీమె హృదయము నృత్యమొనర్చినది. రామచంద్రుని పాదారవిందముల మరందలోలుపమధుపమైనది యీమె కోమలహృదయము. ఉప్పొంగిన స్నేహధారల నొప్పవెలిగిన భక్తిదివ్వెతో భగవంతునికి నివాళి పట్టినది.

———



# వేంకటాచల మాహాత్మ్యము.



శ్రీమతి గౌరీవాగేశ్వరీదేవి కృతియగు "శ్రీ వేంకటాచల మాహాత్మ్యము" మిక్కిలి భక్తిస్ఫోకరము. ఈమె ఈ కావ్యమున తనకు వేంకటేశ్వరస్వామిపై గలభక్తిని బాగుగా వెలిబుచ్చినది. స్వామిమాహాత్మ్యము కొనియాడుటయే యిందలి ప్రధానవిషయమైనను కవయిత్రి కలియుగావతరణముతోఁ గావ్య రచన సాగించినది. కలియుగమున మానవు లనుభవించు వివిధకష్టములను, వారు చేయు పాపములను కన్నులఁ గట్టినట్లు పలికినది. కవయిత్రి యిచట పలురకముల పాపములను బాధలను, దుర్గుణ, దురాచారాదుల వర్ణించుచు మానవాళికి మంచినీతి నుద్బోధించినట్లు కనబడుచున్నది.

క॥ ఆదిని సారస సంభవుఁ
డాదరమున సృష్టిఁ జేయ నా కలివేళన్
వేదములు ధర్మమన మది
మోదింపని వారలైరి మూర్ఖపుజనముల్. 1

సీ॥ ఎంతేసి గృహముల నెందైన వీక్షింప
దాంపత్యమునఁ బోరు తప్పలేదు
ఏయింటనైనను బాయని భవదుఃఖ
విషయ వాంఛాతతుల్ విడువలేదు

ఏమందిరమునైన నించుక కనుమాత్రఁ
గలి కల్మషంబుల తలఁపులేదు
ఏసద్మములవెంట నెన్నంగఁజూచినఁ
బరువు మర్యాదయు నురువులేదు

తే॥ పాతకంబుల గావింప భీతిలేదు
పరగు గురుదేవదేవతా స్మరణలేదు
వెలదిపానంబు జూదంబువేట దిగులుఁ
గలియుగంబున నిండారెఁ గల్మషములు. 2

క॥ అలజడి భయము నశాంతియు
నలుకయు మచ్చరముగోటు నతిదుష్టతయున్
వెలయాలి మొదలుఁగాఁగల
కలుషంబులుఁ బెక్కుకలియుగంబునఁదోచెన్. 3

క॥ పరజననింధారతియును
బరజనధనహరణపరత పరసతిరతియున్
బరసౌఖ్యనివారణమును
గరమక్షయమయ్యెఁగలియుగంబున నెంతేన్. 4

క॥ అన్నాతురత జనంబులు
గన్నుల నశ్రువులుఁ గ్రమ్మఁగడుదీనత సం
పన్నగృహస్థుల ముంగిలి
నున్నవిధము తలఁప దుఃఖముత్పాదించున్. 5

సీ॥ అధికమైకా్రిలు గ్రీష్మాతపంబున నోడి
వాడిన తీగెల వడువుఁజూపి

యుఱుములఁబిడుగుల నుడగక జటిలమై
కురిసెడు సోనకుఁగొయ్యబాఱి

హిమవంతుఁడైన రహిం జలించెడుమంచు
వఱలిన నెంతేని వడవడంకి

కడుపునిండెడుతిండి కట్టు వస్త్రములేక
నరయ ముప్రొద్దుల నటమటించి

ఆ॥ యుండనిల్లులేక పండభూమియులేక
పరగ భూరికష్టభాగులగుచుఁ
జెట్లనీడనిలచి చెలువేదిదుఃఖించు
వారిఁజూడ విధికి వగపురాదె!. 6

క॥ కోపమునుబ్బును గర్వము
దాపము మచ్చరము మోహదంభంబులు సం
ప్రాపితదుఃఖావేశముఁ
జూపోపమి కలియుగానఁ జూపట్టుఁగదా! 7

క॥ అక్కరకురాని మిత్రిత
మక్కువయుఁ బ్రేమలేని మర్యాదలు ర
చ్చెక్కిన గృహకలహంబులు
నిక్కమ్ముగా కలియుగంబు నీచంబుగదా!. 8

ఉ॥ వాదములేనిచోటు ఖలవర్గములేనితలంబు మోసముం
జూదములేనితావు పటుశోకములేని ప్రదేశముం మనః
ఖేదములేని చెంకి సురకేళి నొనర్పని మందిరంబు మ
ర్యాదకు పన్నిదంబునకునై నఁ గనుంగొనఁగాదు భూస్థలిన్

చ. ఖలమతినుంటసజ్జనులఁగన్గొనమంటమదంబుఁగొంట ముం
గలకునురానిపంట యురుకామగుణాదులనుంట యుక్తిఁ బె
ద్దలగుణవర్తనల్ తలఁచి తద్దయునిందలొనర్చుచుంట ని
చ్చలుగురుహేలనంటకడుసాగుఁగదా!కలికాలమందునన్,

ఉ॥ సారములేని విద్యలును సత్యములేని ప్రతిజ్ఞ నిర్మలా
హారములేనివిందు వినయంబుఘటింపనిసేవ సంతతా
ధారములేని జీవనము దారలులేనిగృహాలు బుణ్యకా
సారవిహీనమావనులుఁ జాలగదా? కలివేళఁజూచినన్. 11

చ॥ తెలియనివేదశాస్త్రములు తేజములేని నరేంద్రజన్మముల్
గలియని బాంధవంబులు వికాసమునొందనిబుద్ధి ప్రేమమున్
దలఁపని దంపతీగరిమ తథ్యముకాని వచోవిలాసముం
బలమునెఱుంగకున్నరణబంధునులీకలినాఁడుఁజూడఁగన్ 12

ఉ॥ శౌర్యములేని విక్రమము సౌమ్యములేని తపంబునిండుమా
ధుర్యములేని భాషణము దూర్యవిలాసములేనిపెండ్లి యౌ
దార్యములేనిదానము నిదానములేనిజపంబు బుణ్య స
త్కార్యములేని జన్మమును గానఁగున్ గలిభూమి నిండుగన్.

ఉ॥ మానములేనిజీవనము మందులెఱుంగని వైద్యకోటి వి
జ్ఞానములేని పండితులు సాదరమొప్పఁగ నాత్మబంధు స
న్మానములేని కార్యములు నాయమెఱుంగని పెద్దలున్ లస
ద్గానములేని గాయకులుఁగాదె? కలిన్ బరికించిచూచినన్.

క॥ రసపోషణమన నెఱుఁగని
రసికతయున్ జన్మభూమి రాజిల్లని దు
ర్వ్యసనభరజీవితంబును
వెసనోమరితనముఁజూడ వైరిగ యుండున్. 15

క॥ అవివేకపరత సంతత
వివిధవిషయవాంఛదుష్టవిక్రమమును బ్రా
భవవిప్రశాస్త్రనిందయుఁ
గలినిందాపరతఁజెల్లుఁగలి కాలమునన్. 16

క॥ గురువులనన్ విద్యార్థులు
పరిహాసముగాఁగఁజూచి భావింతురు ని
ర్భర కరుణా పరతంత్రత
గురువులకున్ గొఱఁతజూవె! గురుకలివేళన్. 17

వేంకటాచలమున సేంచేసియున్న వేంకటేశ్వరస్వామి తన భక్తుల పాలిటి కల్పశాఖి. ఆతని శరీరసౌందర్య మలంకారములతో నినుమడించి కడు కమనీయ కాంతిరేఖలతోఁ గ్రాలుచున్నట్లు కవయిత్రి హృదయమూహించి మురిసి తనిసినది. వేంకటాద్రి బహువిధ ఫలవృక్ష భరితమై నానావిధ సంతాన సంతన్యమాన కోకిలాలాప భగవన్నుతి బహులమై, దేవతలపువ్వు వృష్టిచేఁ బరిమ

శింఖునదై పరిష్కృతశోభా విభాసితమై పరమపవిత్రమై యొప్పియున్నట్లు వర్ణించుచు వ్రాసిన గాంగమము.

సీ॥ మండితనవరత్న కుండలంబులతోడ
డంబైన వరతిరుపుండ్రంబుతోడ
సర్వాంగసుందర సౌష్ఠవస్ఫూర్తితో
లాలితపీతచేలంబుతోడ
నంగుళీయక కంకణాది భూషలఁదోడఁ
గమనీయ శంఖచక్రములతోడ
నాపదలడగించు నభయహస్తముతోడఁ
జేకొందునని చాటుచేయితోడ

ఆ॥ విమల వికసితారవిందంబుపై నిల్చి
కనుల కుత్సవంబుగాఁగ వెలసె
నంబుజోదరుండు నహిరాజగిరిమీఁద
భక్తజనుల నోముపండినట్లు. 18

సీ॥ ఫలపుష్ప పల్లవభార నమ్రములైన
ఘనకల్ప కల్పవృక్షములతోడఁ
గమనీయ సురభిసంకలిత పరిసార భా
సితమైన మందమారుతముతోడ
శ్రీరమాధిపనామ చింతనాద్భుతమైన
కలకలారావ సంకులతతోడ
తీర్థయాత్రాసక్తి దీపింపవిందుగ
సతతంబు నశేషజనముతోడ

తే॥ సురలు వర్షించు పువ్వులసోనతోడ
వివిధమంగళ తూర్యోరురవముతోడఁ
గడఁగి ప్రకృతి వర్ణించు కవులతోడ
బళిర! శేషాద్రి కన్నులపండువయ్యె. 19

సీ॥ అర్థార్థులకు విశేషార్థంబులొసఁగూర్ప
నలకల్పకము వేంకటాచలంబు
ఘనవిపద్ఘోరాంధకారముల్ సమయింప
నర్కబింబము వేంకటాచలంబు
కడిఁదిమై భోగభాగ్య ప్రసిద్ధి వహింప
నమరధేనువు వేంకటాచలంబు
కలుషసంసార మేఘంబులఁ విరియింప
ననిలతేజము వేంకటాచలంబు

తే॥ భూతదైత్య పిశాచాది భీతినడప
నచ్యుతునిచక్రమా వేంకటాచలంబు
భూరిసద్భక్తతాపనివారణంబు
నతులసౌఖ్యాస్పదము వేంకటాచలంబు. 20

ఉ॥ ఎన్నఁడు వేంకటాద్రిగననేగుదు ముంగల నల్లనయ్య సం
పన్నగుణాభిరాముఁగని భక్తినిజోతలు వెట్టికొందునే
నెన్నఁడు మందవారమున నిల్పెదు శౌరికి దీపమంచులో
నెన్నినఁజాలుఁ బాపములునెన్నఁగనాశమగుఁ క్షణంబునన్.

తే॥ దివ్యములుచూవె! నందుఁ బ్రదీప్తవిమల
భూరితీర్థంబు లఖిలాఘహారకములు
కలుషసంహార సౌభాగ్యకారణములు
పుణ్యమంగళ సద్భాగ్యపూరణములు. 22

ఉ॥ మ్రొక్కినమాత్రి వారలకు మోదముగూర్చియ శేషపాపముల్
గ్రక్కునసంహరించి భవకల్మషకోటి నడంచి భోగముల్
పెక్కులుగూర్చి దుర్దశలభీతినడంచి తనూజులట్లకా
మక్కువఁజూడ వేంకటరమాపతిచూవె! శరణ్యుఁడయ్యెఁడున్

ఉ॥ కోరికలున్న చోట నఘకోటు లడంపఁదలంచు చోట వి
స్తారభవజ్వరాదులను శాంతివహింపనిచోట భూతముల్
సేరినచోట లేవడిని సేగి వహించినచోట భక్తమం
దారుని వేంకట ప్రభుపదాబ్జములెన్న శుభంబ కూరెడున్

ఉ॥ చేరువకొండపై కనకచేలుఁడు వేంకటవల్లభుండు వి
స్తారకృపాప్రభావమున సన్మతిఁ గైకొని యల్లవారి సం
సారభయప్రపంచమును జక్కడగింప ససంభ్రమంబుగా
నారయుచున్నవాడహహా! యాంధ్రులభాగ్యమదేమిచిత్రమో

తే॥ అమ్మహాపర్వతముఁజూచి నట్టులైన
మఱలిపోవంగ నేర్చునే మానసములు
సురుచిరాకారసంపద మురిసియున్న
పన్నగాచల మీక్షింపకున్నఁగాక. 26

సీ॥ ఘనతర పుణ్యావ ర్తనమింత తెలియక
కలికాలమెంతగాఁగ్రాలుచున్న
జటులరాజన్య దౌర్జన్యకాఠిన్య దు
ష్టత్వంబులెం తెంత సాగుచున్న
భూరిమహాపాప ఘోరహింసాకాండ
ధరణిపై నెం తెంతఁ దగులుచున్న
వీరమహాకాల క్రూరపాదాహతి
ముల్లోకములు తల్లడిల్లుచున్న

తే॥ తామపీడన లేవడి జఱగుచున్నఁ
బలువిపత్తులు భూచక్రమలమికొన్నఁ
బ్రళయమరుదేర భూతౌఘ విలయమైన
విదిత శేషాద్రిపై శాంతికదలకుండు. 27

ఉ॥ ఏమని చెప్పవచ్చు జనులెన్నఁగ నాగిరిఁజూడనేగి యం
దామరవాహినీగరిమ నద్భుతశక్తి తనర్చునిత్య పు
ణ్యామలవారి దోగి దురితౌఘములన్ బరిమార్చి పావన
శ్రీ మహనీయవైభవముఁజెంది సుఖంతు రనంతపుణ్యులై

ఉ॥ అల్పులు మందబుద్ధులు భవాంబుధిదాటఁగభక్తవాహినీ
కల్పకమప్రమేయతర కాంతి విలాస పవిత్ర భోగిరా
ట్తల్పనివాసయోగ్యమగు తద్గిరిఁ గన్నులఁజూచి సిద్ధసం
కల్పముతోడ మోక్షరమఁగైకొని గ్రాలుచురున్న తస్థితిన్.

# మహాలక్ష్మీ భాగవతము



ఈ కవయిత్రుల మహోత్కకృతియగు భాగవతముఁ గవితతేనెవాకయై యుదాత్తభావబంధురమై సాగిపోయినది. అవ్యాజభక్తి పరిపూర్ణహృదయలగు వీరీగ్రంథమున భగవల్లీలలు బహుముఖముల వర్ణించి సహృదయానందమొనర్చిరి. ఔచితినిగుర్తించి రసానుకూలమగు రచనతో కవితాసౌరభమును పారిజాత పరిమళముమాడ్కి పరిఢవింపఁజేసిరి.

భగవంతునికట్టి న్యూనతను సహింపని వీరి యీకవితకు నిదానమైనది శ్రీ పోతనామాత్యుని భాగవతకృతి. ఈతని భాగవతమున దక్షయజ్ఞఘట్టమున పరమశివునివైపగల న్యూనత కవయిత్రులలేత హృదయముల గలఁతబెట్టి యిట్టి కృతి యొనర్పఁజేసినది. అందులకై యీ మహాలక్ష్మీభాగవత సంగ్రహ పరిచయము దక్షయజ్ఞముతోఁ దరలినది.

శ్రీ రమణీకళత్ర! నిజసేవక సన్నుతిపాత్ర సర్వదే
వారికులౌఘజైత్ర! పరమాద్భుత పుణ్యచరిత్ర! నిత్య శృం
గార వినీలగాత్ర! నవకంజదళాయత చారునేత్ర! బృం
దారకవందనీయ గుణతండ పవిత్ర! విచిత్రవర్తనా! 1

ఉ॥ బాలలమైననాఁడు కడుభక్తి భజింపఁగరానినాఁడు వా
చాలతలేనినాఁడు శ్రుతిసారమెఱుంగని పిన్ననాఁడు వి
ద్యాలలితంపునైపుణియు నద్భుతకావ్యవికాసమింతయున్
జాలనినాఁడు నీకరుణ చాలెగదా! మముఁబెద్దసేయఁగన్.

చ॥ జనకుఁడు రామమూర్తి గుణసాగరలక్ష్మి పవిత్రమూర్తిమా
కునుదగ తల్లియయ్యెనట! గోపకిశోరుఁడు నాదిదైవమై
ఘనతనొసంగెనట్టి! కవికల్పక మఞ్జురాణి వాణి పెం
పున కరుణించునట్టి! నిజపూర్వకృతంబులు రిత్తవోవునే?

సీ॥ మాతల్లి నిరతంబు మన్నించి బోధింప
నీభక్తి మనములు నిలుపఁగలిగె
మాతల్లి కరుణఁజేయూతఁ గావింపఁగఁ
గన్నుల నీమూర్తిఁగనుట గలిగె
మాతల్లి ప్రేమమై గీతామృతమునీయఁ
బరమాత్మ! నీకృప పట్టుగలిగె
మాతల్లిశక్తి నజ్ఞాత సంభవురాణి
నిండారమమ్మ మన్నింపఁ గలిగె

తే॥ సతము మాతల్లి పదసేవ జలుపుకతన
వరద! ముక్కోటివేల్పుల కరుణగలిగెఁ
దల్లియానతిఁగడవని తాల్మిమాకు
నందనందను సత్కృప నందఁగలిగె.

సీ॥ కంజాక్షు కథల నాకర్ణింపఁ దొలిజన్మ
నమరించినట్టి పుణ్యమున జేసి
పావనశక్తి సంపన్నమాతల్లిగా
బడయగల్గిన తపఃఫలము జేసి
భార్గవీరమణు రూపమును సందర్శింపఁ
గావించుకొన్న భాగ్యమునఁ జేసి

భాసురంబౌ తెల్గుభాష మా భాషగా
జన్మంబుగన్న హర్షమునఁ జేసి

తే॥ బాలకృష్ణుని కరుణచే భాగవతము
వ్రాసి కృతినిచ్చి హరిపూజఁ జేసినాము
భవమహాసాగరము భీతిఁ బాసినాము
జన్మసాఫల్యమును బొందఁజాలినాము. 5

ఆ॥ ఆదివిష్ణుగీత వేదాంతసారంబు
సాధుభక్తలోక సౌఖ్యకరము
నట్టులగుట తల్లియానతి చే నిందు
సురుచిరముగఁ బొందుపరచినాము. 6

ఉ॥ పంబినవేడ్కతో విబుధపాలకు లెంతయు సంస్తుతింపఁగా
తుంబుర నారదుల్ వొగడతో చెడినారవము దునేఁడు కా
వ్యంబును నాలకింపబడ దంబుజలోచన! కాన శేషత
ల్పంబును డిగ్గివచ్చి కృప భాగవతంబును నాలకింపవే! 7

మత్తకోయల॥ ఎద్దునెక్కినవాడ దైవతమెల్ల లోకములందు వే
ఱెద్దిలేదని కొందఱాడఁగ నేర్పడన్ మఱికొంద ఱా
గ్రిద్ద నెక్కినవాడ దైవముగాక యందురు యెవ్వరే
పద్దునట్ట వివరించినన్ దగుబ్రహ్మమొక్కఁడె యవ్వలక్ష్మి,

సీ॥ జనసమూహములకుఁ గనవచ్చు విశ్వంబు
శ్రీనాథవ్యూహమా విశేషమనియు

నాబ్రహ్మ కీటపర్యంతంబు ప్రాణులు
భార్గవీనాథాంశ ప్రభవులనియు
నమరు నహంకార మమకారములఁ జేసి
నరుఁడు మువ్వేకల దిరుగుననియు
మాయాప్రభావ నిర్మగ్నులై జీవులు
దమవృత్తులంతె కాదలఁతురనియు

ఆ॥ భవచయంబులెల్లఁ బాయగ మార్గంబు
భోగిశాయి భక్తియోగమనియు
బ్రజలకెల్లఁ దెలియ భాగవతంబు నా
వ్యాసగురువరుండు వ్రాసెనపుఁడు. 9

—: దక్షయజ్ఞము :—

క॥ ధీరత దక్షుఁడు సుమహా
దారుండయి సవనమొకటి దానొనరింపన్
గౌరీశు రాకమఱచిరి
పేరువడిన వేల్పులెల్లఁ బెద్దలు మునులున్. 10

తే॥ పరమ మాహేశ్వరాచారపారగుండు
సతతనందిత దేవతా సంచయుండు
దివ్యముని శీతరోచి దధీచి పలికెఁ
బాటవంబున శివురాని లోటుఁ దెలిసి. 11

ఉ॥ అన్నివిధంబులన్ సురజనౌఘము కార్యభరంబుఁదీర్పఁగ
న్నన్నన నెల్లవారలును పద్మతిమై ధరియింపఁ బ్రీతి వి

ద్వన్నతుఁడౌచునా భృగుపుత్త్రిశుకర్మనొనర్పఁగా మఖం
బున్నతిఁజూడ పండువయియున్నది దక్షబుధపరిపూజ్యమై.

క॥ అవయవములన్ని గలిగియు
వివరింపఁగ శిరములేని విధమున దగ నీ
సవనముగడు నొప్పిదమై
భవుఁడొక్కఁడు రానిలోటు పాటించెజుమీ?. 13

సీ॥ చౌవంచమోముల సాహేబు, 'ముక్కంటి,
వినువాకమోపరి, ఘనుకుదారి
చిలువపానుపు దంటచెలికాడు, నెలతాల్పు,
వేయిచేతులజేని చాయవాఁడు
విసము కుత్తుకనిండ వెలయ నిల్పినసామి
చెలువొందు ముమ్మొనయలుగుమేటి
గట్టువిల్తుఁడు, కరకంఠుండు, చక్కెర
విలుకానిసూడు, వేల్పులమగండు.

తే॥ గట్టుపలిక మనుమనిఁగన్న తండ్రి
గాములకురాజు, తగబేసి కంటివేల్పు
యల్లుఁడయ్యెను చాలదే? యనఘ! నీకుఁ
బాటవంబుననిఁక బెక్కుమాటలేల?. 14

సీ॥ కనగ గట్టులరాజు కన్యాలలామంబు
మామయై రామయై మఱిచెలంగ

శ్రీదేవినాథుండు సైదోడుగూడి తా
నమ్మగా సొమ్మగా ననువుపడగ
పెద్దకొండలరాజు బెంపారు గిరిరాజు
విల్లుగా నిల్లుగా జెల్లుచుండ
కుధరమెత్తినవాఁడు గూర్మి వంచినవాఁడు
మిత్రుఁడై పుత్రుఁడై మేల్మిదనర

తే॥ విశ్వవిశ్వంభరావనవిపులదీక్ష
దక్షదక్షిణ బాహుండు దయదలిర్ప
నీకుఁ దా శిష్యుఁడై యుండె నిదియచాలు
గారవింపని మాననీగలదె గొఱత. 15

ఉ॥ ఆవిభు డించుమాత్రమున నల్గినమీద జగంబులన్నిటన్
గావఁగ జాలువాని బుధగణ్యుని వేరొరునిందు జూపుమీ
కావరమేల? దుర్మతము గైకొనుటేల మదంబదేల? పై
నీవును నిన్నుఁగన్న నవనీరజ సూతియుఁగావ నేర్తురే?.16

క॥ ఏవానిఁగూర్చి చేసెద
వీవరయజ్ఞంబు దైవమెవ్వఁడుమది సం
భావించితే విధానముః
భావజు హరుఁదలఁప విట్టి ప్రాజ్ఞులుగలరే. 17

ఉ॥ ఆదనుజేంద్రభీతికరుఁడాది గురుండు ప్రసన్నమూర్తి నే
కాదశరుద్రరూపముల గౌరవవృత్తి చరించుచుండె సం

వాదములేల? జూడుక్రతువాటికయందు నెఱుంగవొక్కొ? దు
స్స్వాదమురోషదోషములమానుముదక్ష! హితంబుఁజెప్పెదన్

క॥ నీవే వహ్నింగాకోని
భావించితి క్రతువు జేయఁబ్రజ్ఞానిధివై
యా వహ్ని రూపమరయగ
శ్రీవరసఖురూపమగుట జింతింపవొకో? 19

ఉ॥ మాటలువేయునేమిటికి? మానుము సర్వచరాచరాత్ము ద్రో
హాటకళాధరున్ బరముశంకరు నన్యము జేయుబుద్ధి ని
ష్పాటవహారింపు క్రోధమునుబాసి ప్రియంబున బిల్వబంపుమిం
కేటికి జాలమాసతి, హృదీశసమేత, జగన్నుతంబుగన్. 20

సీ॥ భూరితుండము పెద్దబొజ్జగలాఁడు నీ
సకల విఘ్నంబుల సంహరింప
నీ కనుసన్నల నిచ్చలాప్రమథాలి
నిఖిల కార్యంబుల నిర్వహింప
సకల వధూజన సౌభాగ్యదాయినై
ముద్దరాల్ నీసుతముద్దుగూర్ప
నగచాపుఁగీర్తించు నారదగీతంబు
డంబుమై శ్రవణ పర్వంబుగాఁగ

తే॥ దలఁప బ్రహ్మాదిదేవబృందములఁ గూడి
ఘామదేవుండు నీ యజ్ఞవాటి నిలువ

సురుచిరంబు నచింత్యంబు శుభదమగుచు
దక్ష! నీయజ్ఞ మెంతేని( దనరకున్నె? 21

తే॥ భువన కల్యాణముల బ్రహ్మపూనెనేని?
వఱలు సేమంబు నిన్ బొందవలచునేని?
సవనమెన్న నవిఘ్నమై సాగ(నేని?
దక్ష! నీ వీశ్వరుని( బిల్వదల(తుగాక. 22

ఆ॥ కర్మమెవనికైన ఖండింప(గారాదు
వారిజాతహితుని వంటివాని
గోవురూపు నిలపె భావింపవచ్చునే?
దక్షుడెంతవాడు దల(పననుచు. 23

వ. అని దధీచిప్రముఖమహామును లరుగునంత, 24

క॥ శివరహితంబుగ నీగతి
సవనము గావింపనేల? జనకుండనిలో
నవవనజపత్రలోచన
భవుసతి చింతించెబెక్కుభంగులనఘా! 25

చ॥ స్వయముగ నేగి దక్షునకు శంభువిరోధము మానుమంచు ని
శ్చయముగ(జెప్ప(బూనిసతి శాంకరిజన్నము(జూడనేగ(గా
బ్రియుని ప్రియంబుగైకొని విరించికుమారకు(డన్న వాక్యముల్
వయమునలో(దల(చుచు ఘనంబుగ నేగె సఖీయుతంబుగ(

సీ॥ కాశ్మీరకుంకుమ కర్పూర మృగమద
ముఖ్యంబులొకయింతి మున్నెగూర్చె
సవరించెనొక చామ సతికి బ్రియంబుగా
భూరిహారానేక భూషణములు
నవరత్నముల చాయ వివిధాంబరశ్రేణిఁ
బొలుపొందనొకభామ పొందుపరచెఁ
బదిలంబుగాఁజేర్చె మదిరాక్షియొక్కతె
చెలువొందు వీణావిశేషములను

తే॥ వఱలు సుమకోటి వలసిన వస్తువులును
నందముగఁగూర్చె నొక్కతె సుందరాంగి
దక్షతనయ సతీదేవి దండ్రిఁజూడ
సవనభూమికి వేంచేయు నవసరమున. 27

దవ్వుదవ్వులఁజూచి తలవంచి గేల్మోడ్చి
సురుచిరంబగు భక్తిఁజూపువారు
నవలోకనముసేయు నంత నంజలిచేసి
భద్రవాక్యంబుల బలుకువారు
నెదురగునంత సమ్మోదితభక్తి దనర్చి
వఱల నడ్డముజూప కరుగువారు
ముంగల కరుదేర మ్రొక్కి హర్షంబున
విడువక కుశలంబు లడుగువారు

దేవికడ్డంబుగాకుండ దిరుగుఁడనుచు
భక్తిమై వేత్రదండముల్ బట్టువారు

నగుచు సభ్యులు సందడినందుఁ గొనిరి
రాజితరంబుగ శాంకరి రాకజూచి. 28

క॥ ఆయింతిరాక గనుగొని
పాయనిహర్షమునఁదల్లి బాంధవజనముల్
డాయంగవచ్చి ప్రియమున
మాయమ్మ! శుభంబుగుశలమగునే? యనుచున్. 29

ఆ॥ సవనవిధికినెల్ల సద్బంధులకు దేర
నీవురామిచేసి భావమందు
వగపుతోఁ జెనేఁడు వచ్చితే నీవని
కంటనీరు నించెఁ గన్నతల్లి. 30

ఆ॥ భవుఁడు రామి తెలిసి భావించి దక్షుండు
గడమకూతుప్రేమ గారవించి
యువిదఁజూచి సాదరోక్తులమన్నించి
యలికనేత్రుమాట లడుగఁడయ్యె. 31

తే॥ సవనదీక్షాసమన్వితు జనకుఁజూచి
యఖిల జనములు సద్భక్తి ననుసరింప
శర్వరహితంబునైన యజ్ఞంబుజూచి
పుణ్యచారిత్రసతి నిజ బుద్ధివగచి. 32

క॥ అల్లుండ్రఁ బిలచినాఁడవు
చెల్లెండ్రకుబ్రీతి గాఁగఁ జేసితి పూజల్

బల్లిదుఁడు శివునిదలఁపవు
చెల్లునె? ఈసాహసంబు జనకా! నీకున్. 33

సీ॥ భుజగేంద్రతల్పాదిపూజనీయుండైన
యిందుకళాధరు నిందచేసి
నిగమసంతానార్చ నీయుఁడౌ సర్వజ్ఞు
మనుజునిగతి నొందు మాటలాడి
సనకాది యోగీంద్ర సంభావనీయుని
నూటి నపూజ్యుగా దేటపరచి
పరమభద్రానందభాగ్యసంపన్నుని
కేవలమాత్రుగాఁ గేలిచేసి

తే॥ పద్మగర్భాది బుధులకు భాగ్యమొసఁగ
లేమిగా నీకు బరము నిష్కాముఁబలికి
వెలయ బాంధవులందున వేఱుచేసి
తండ్రి! శంకరు నిందింప ధర్మమగునె?. 34

శా॥ అజ్ఞానంబు హరించిగాని గనరాదాపుణ్యు బ్రహ్మాది వే
దజ్ఞుల్ తత్పరమేశ్వరున్ నిజమనోధామంబులన్ జేర్చి స
ద్విజ్ఞానంబున బుద్ధిమూలమున భావింపంగ రాదందురా
యజ్ఞాధీశ్వరు నన్యుగాదలఁచి యీయజ్ఞంబుగావించితే? 35

సీ॥ ఫాలారుణాక్షదివ్యప్రభానిచయంబు
ప్రళయకాలైకవిభ్రాంతిఁ గొలుప

నతులితోజ్జ్వలిత హేలాట్టహాసము సార్ధి
మేదురధ్వానంబు మ్రింగికొనఁగ
జ్వాలాగ్ని కీలాసుజాలకరాలత్రి
శూలంబు కెంగేల వాలుఁజూప
ఢమ ఢమార్భట ధీరఢక్కాస్వనంబుచే,
బ్రహ్మాండ భాండంబు పగులబాఱ

ఆ॥ బల్లజటలకెంపు బాలచంద్రుని సొంపు
ప్రకటముగ లోకభీకరముగ
సవన మీవు సేయు సరణినాకర్ణింప
నభవుడాఢ్యు డెంతనలుగు నొక్కొ. 36

తె॥ సకలవేద పురాణశాస్త్రమ్ములెఱిఁగి
ధాత నిర్ణీతధర్మపథంబు దెలిసి
చంద్రధరుఁ డాదిదైవమట సత్యమరసి
పనికిమాలిన కినుక లోఁగొనఁగనగునె?॥ 37

సీ॥ చింతింపదేవతా జ్యేష్ఠుఁడౌనా బ్రహ్మ
కన్నకుమారకుం డన్నమాట
సాటివారలలోన సత్కీర్తి నురుశక్తి
నరయప్రజాపతి వన్నమాట
నిఖిల ధర్మాగమానీక విజ్ఞాననై
పుణ్యసంపద నుర్విఁబొల్చుమాట

దేవాదిదేవుఁడా భావజాంతకుఁడీశు
డఁప్రమేయునిమామవన్నమాట

తే॥ కూర్మిఁదనవారిలోఁ జేరుఁగొన్నమాట
నఖిలగురుకీర్తనీయుండ వన్నమాట
దలఁపుసేయంగ మఱచితో తండ్రినీవు
శూలినీశానునిందింపనేల చెప్పుమ? 38

క॥ హరమయము నిఖిలజగమును
హరమయుల్జ్ఞానాదు లఖిలమునీంద్రుల్
హరమయముగాని దొక్కటి
పరమాణువులేదులేదు భద్రచరిత్రా! 39

మ॥ననుచింతింపకనాత్మబాంధవుశివున్ నానాప్రభావోజ్వలున్
ఘనుజామాతను జీరికిన్ గొనక దుఃఖంబింతయుఁ లేక యే
మనియాగంబొనరించి తోజనకసన్మానంబులేకున్ననా
తనువింకేటికి దుఃఖభాజనముగాదా? బాంధవశ్రేణిలోన్.

వ॥ అనిపలికి ఒక్కింతతలంచుకొని ఆజగదంబ ప్రాఙ్ముఖం
బుగా నాసీనయై నిజశక్తిబలంబున యోగాగ్నిఁగల్పించిన.

సీ॥ పదపల్లవములందు బ్రవహిల్లునావేళ
నరుణాంబుజంబుల నలరు జిగియు
గటితటంబునజొచ్చి గ్రాలుచో కాంచన
సన్మణిమేఖల చక్కదనము

కంఠప్రదేశంబు గడలుచో నూతన
రమణీయ రక్తాంబరంబు చెలువు
ఘనత లలాటభాగంబున దివురుచో
గమ్రసింధూర రాగంబు పొలుపు

ఆ॥ మూలినవతరింప మధ్యాహ్నమార్తాండ
బింబ తీక్ష్ణగరిమ బెంపుగాఁగ
ఫాలనేత్రు నాత్మ ప్రస్తుతిగావించి
బాల యోగవహ్ని భస్మమయ్యె. 42

ఆ॥ భవుని నిందవిడువ బలుమారు బోధించి
తనయ యోగవహ్ని దగ్ధమైన
క్షణమునంద బాష్పకణపూరితాక్షుడై
దక్షుఁ డెటుకమరచె ధన్య ! విదుర ! 43

* * *

సీ॥ బాల్యచేష్టలవేడ్క పల్లవింపండయ్యె
గజవైరి మౌళి విఘ్నాధిపుఁడు
రమణీయ వింజామరములు బూనగరారు
మదనారికిక సప్తమాతృకలును
మునుపోలె నర్తనమును జూపనొల్లరు
హరుమౌళి భృంగీశుఁడాదిగాగ
సగుణ నిర్గుణచర్చ సాగింపవెఱచెబో
భగవంతు ముందర నిగమగణము

తే॥ ప్రమథులయ్యాళుచేరంగ భయమువడిరి
జడసిరమ్మూర్తి నీక్షింపఁ జామలెల్ల
బ్రళయకాలంబకో యంచు నలువదలఁచె
నభవుఁడా దక్షిణామూర్తి నందునాడు. 44

సీ॥ మహనీయకాలాభ్రమండలాద్భుతనీల
సలలితమగు మేనిచాయవాడు
సర్వాయుధోగ్రవిశాలసంపచ్ఛక్తిఁ
బదినూరుచేతులఁ బరగువాఁడు
త్రైలోక్యభీకర దారుణభూరి దం
ష్ట్రాంకుర ధగధగ ప్రభలవాఁడు
శతకోటికోటిభాస్కరవాయుమి
త్రాబ్ధి సంభవభూరి తేజంబువాఁడు
తే॥ కీర్తిజగదేక భీకరమూర్తివాఁడు
లీలమై యెల్లజగముల నేలువాఁడు
హరిహరాంభోజగర్భుల కాద్యుఁడైన
భద్రతరశక్తి శ్రీవీరభద్రుడయ్యె. 45

సీ॥ అతనిరూపంబప్పు డమరేఁ జూపరులకు
భయమును బ్రియమును బట్టుకొలిపి
యతని హాసంబొప్ప నలరఁజూపరులకు
వెఱపును మఱపును వెల్లిగొనఁగ

నతనిచేష్టయుఁ దగె నరయఁజూపరులకు
దుష్టము శిష్టమై దుర్భరముగ
నతని వీక్షణమొప్పె ననఘ! చూపరులకు
బలుశ్రుచు జెలువును జెలఁగఁజేసి

ఆ॥ అతని కన్నులొప్పె నరవిందముల సొంపు
నగ్నికణముఁగెంపు నలరజూపి
దక్షసవనభూమిఁ దా ధ్వంసనముచేయ
వీరభద్రమూర్తి వెలయునాడు. 46

సీ॥ అర్ఘ్యపాద్యాదుల నర్పించువారును
చెంగల్వపూలఁ బూజించువారు
వేదసూక్తంబుల వినుతించువారును
సామగానంబును సలుపువారు
భాసిల్లుగురుశాంతి బాటించువారును
భద్రవాక్యంబుల బలుకువారు
మొనసి హస్తాబ్జముల్ ముకుళించువారును
సురుచిరంబగు భక్తిచూపువారు

ఆ॥ నగుచుతపసులెల్ల నంతంతవర్తింపఁ
జూడనొప్పినపుడు సూరిలోక
వందనీయకీర్తి వరవీరరౌద్రాది
నవరసంబులెల్ల నచ్చుపడగ. 47

వ॥ అనంతరంబ వీరభద్రుండు దక్షయజ్ఞ ధ్వంసమొనర్చు
సమయమున. 48

క॥ కొందఱు తెఱలంబారిరి
కొందఱు హతులయిరి నిలచికొందఱుబోరన్
మఱిందిరి భయకంపితులై
కొందఱు కేలోడ్చి భద్రుఁగొల్చిరి విదురా!

*  *  *

క॥ ఆ రజతాచల శిఖరో
దార మహారమ్యవటముదావహరత్న
శ్రీరమణీయవినిర్మిత
గౌరవతరపుణ్యవేదికా సీమమునన్॥

సీ॥ భాసుర ఫాలాక్ష పావకోజ్వలదీప్తి
భూనభోంతరమెల్ల బూరటిలగ
కటితటంబునఁబొల్చు కరటిరాట్చర్మంబు
ప్రళయాంధకారంబు పగిదినొప్ప
నవిరల గరళ విఖ్యాతమౌ మెడకప్పు
పాకారి నీలవిభ్రాంతిఁ గొలుపఁ
బావనరుద్రాక్ష ఫణిరాజహారమాల్
భూరివక్షంబునఁ బొందుపడగ

తే॥ చారు పీయూష కలితార్ధ చంద్రరుచులు
జనులచిత్తంబులకుఁ గొంతశాంతిఁగూర్ప
నరయ నారదుతో మాటలాడువాని
నామహాదేవువీక్షించి రమరవరులు.

తే॥ యోగిజనగేయు భువనైక భాగధేయు
ధర్మసంధాయు వరకవితావిధేయు
భక్తరక్షణ సంరంభుఁ బ్రభునిశంభు
నరసి రాపద్మసంభవా ద్యమరవరులు. 52

శ్లో॥ నమోస్తురుద్రాయ సుభద్రదాయ
చిన్ముద్రహస్తాయ చిదాత్మకాయ
కృపాసముద్రాయ సుఖావహాయ
శ్రీవీరభద్రాయ ప్రభో నమస్తే. 53

సీ॥ పరమాయ! వరదాయ! కరుణావిహారాయ!
బాలచంద్రధరాయ! భాస్వరాయ!
ఘోరదారిద్ర్యసంహారాయ! ధీరాయ!
పరమేశ్వరాయ! శుభావహాయ!
ధర్మాత్మకాయ! సత్యానందరూపాయ!
నిత్యసంతోషాయ! నిర్మలాయ!
మాయావిలాసాయ! మంజులహాసాయ!
భర్గాయ! లోకైకబాంధవాయ!

ఆ॥ పరమపూరుషాయ! భాగ్యవైభవకృపా
బంధురాయ! నీలకంధరాయ!
శాశ్వతాయ! నిత్యశాంతకారుణ్యైక
మానసాయ! తేనమశ్శతాని. 54

తే॥ అనుచు నంజలిఁ గావింప నాదిమూర్తి
శంకరుఁడు సాధురక్షణ సంభ్రమమున
నుగ్రభావంబుఁ బాసి యనుగ్రహించె
దక్షయజ్ఞంబు నవ్వేళ దయదలిర్ప. 55

ఆ॥ బాముతోలఁగి మఱల బ్రతికినచందాన
యజ్ఞవాటి మిగుల నందమమరెఁ
బరమశివుని కరుణ బ్రతికితిమంచును
బ్రణుతిఁ జేసిరా సభాజనంబు. 56

---

* శ్రీవామనదేవుండు బలిచక్రవర్తిఁ జూడబోవుట *

శా॥ ఏ దేశంబు మహాత్ములార! తగ మీ రెచ్చోటవర్తింపనీ
మీదన్ బోవుచునున్న వారు విబుధుల్ మెచ్చంగ నచ్చోటమున్
వేదజ్ఞుల్ కలరే? సుధర్మమతి నవ్వీటన్ విభుండొప్పునే
భూదేవోత్తములార! తొల్లిగని రే? పుణ్యంబు వర్ణింపరే 57

అడుగన్ లేదనకుందురా? నృపులులో నౌదార్యమున్ భక్తియే
ర్పడ వర్తింతురె? గర్వమున్ గనక సంభావింతురా విప్రులన్
గడియాసన్ మఱలంగఁ బోవలయునో? నాడే సుఖంబబ్బునో?
కడమల్ కావుగదా? మనోరథములున్ గల్గున్ గదా? చెప్పుడీ!

క॥ అని వామనదేవుండు ప్రశ్నించినన, 59

తే॥ పట్టుపెన్నఁడు నెఱుఁగని పొట్టివాని
చిట్టిబుద్ధుల కెంతయు నచ్చెఁజూచి
బిట్టుప్రేమయు నబ్బింబు నుట్టిపడఁగఁ
జుట్టములవోలె నాపాఱులిట్టులనిరి. 60

క॥ బలియను దానవపాలుఁడు
సలలిత విక్రమభుజోగ్రశౌర్యంబున వే
ల్పుల నెల్లఁ గోచి యేలెడు
విలసిత సత్కీర్తియుతుఁడు విప్రకుమారా! 61

క॥ ఆతని పరిపాలనచే
భూతలమునఁ గఱవుభీతి పుట్టకయుండున్.
దాతలు కలరా? యీ పృథి
వీతలమున దానవేంద్రు పీటఁ దలంపన్ 62

ఆ॥ జన్నమొకటినేఁడు సన్నుతంబుగఁ జేయు
చున్నవాఁడు దేవసూదనుఁడు
చూడఁ బ్రీతిఁ బోవుచున్నవారము నీవు
వత్తువేని? వెంటవత్తుగాక! 63

వ॥ అనిన నట్లకాకయని. 64

సీ॥ అంధకారముఁబాప నవలీలఁదోతెంచు
భవ్యమార్తాండబింబంబు పగిది

క్షేత్రముల్ కలిమి భాసిల్ల వర్షింపను
తకాలికమై క్రమ్ము మేఘంబుభాతి
సకల జనానంద సంపదన్ జూపట్టు
నల్లనఁబొడము జాబిల్లి విధము
నాపద లడఁగింపఁ జూపట్టుమహనీయ
నిర్మల కారుణ్యనిలయుమాడ్కి

తే॥ నన్న దమ్ములకలహంబు లంతరింపఁ
గన్న జనకుఁడు నేతెంచు కలిమితోప
రక్షణపరాయణుండు నారాయణుండు
భాసురంబుగ బలియజ్ఞవాటికరిగె. 65

వ. ఇవ్విధంబున బలియజ్ఞవాటిం జొచ్చునెడ 66

సీ. సంతతాగత విప్రజన ఘనాశీర్వాద
చాతుర్య సూక్తుల సంతసిలుచు
నిఖలదేశాధీశ నికరార్పితములొుచు
నలరారుకానుకల న దుకొనుచు
సనకసనందాది మునివరుల్ రాఁజూచి
గ్రక్కున సద్భక్తి మ్రొక్కులిడుచు
నర్థార్థులకు విశేషార్థముల్ సమకూర్చి
యీశ్వరార్పణమని యియ్యకొనుచు

తే॥ నిశ్చలైకాగ్రిమానసనిష్ఠనొప్పి
పెద్దయునువేల్పుపెద్దకు నుద్దియగుచు

బసిడిగద్దియఁగూర్చుండె భార్యఁగూడి
చారుసత్కీర్తి నాదైత్యచక్రవర్తి. 67

వ. అద్దానవేంద్రుంజూచి వామనదేవుండు.

శా॥ హస్తంబెత్తి కృపాపరత్వమున దైత్యారాతి దీవించె వి
ధ్వస్తానేక భవౌఘదోష భయసంతాపోగ్ర సంసారప్రా
శస్తున్ శోభనపుణ్య సద్గుణ మహాసంపన్ను సౌభాగ్యధీ
విస్తారున్ గురువిక్రమోజ్జ్వలుమహావీరున్ గృపాసాగరున్

ఉ॥ క్షేమముగూరుగాక! బుధశేఖర పావనభక్తి సత్క్రియా
స్తోమప్రవర్తికిన్ సుజనశోకనివర్తికి దేవతాచమూ
భీమరణప్రవర్తికి గభీరపరాక్రమ ధైర్యసాహసో
ద్దామ జగత్త్రయీభరణ దానవసత్కుల చక్రవర్తికిన్॥70

వ॥ అని దీవించి మెల్లన మధురవాక్యంబుల నిట్లనియె. 71

ఆ॥ కన్నవారలకంటె మున్నవారలకంటెఁ
జన్నవారకంటెఁ జతురబుద్ధి
నగ్రగణ్యశ్రీల నలరుచుందువుగదా?
యసురవర్య! యదియ యద్భుతంబు. 72

వ. అని పలుకు నవసరంబున. 73

సీ॥ మండిత నవరత్న కుండలంబులవాని
వల్కలాజినముల వఱలువాని

హాసనుందర వదనార విందమువాని
భువన మోహనమూర్తిఁ బొసఁగువాని
లలితకమండల కలితహస్తమువాని
దండంబు ఛత్రింబుఁ దాల్చువాని
రాకేందు హీరమరాళ వర్ణమువాని
భువనైక రక్షణంబూనువానిఁ

తే॥ బ్రికటరుద్రాక్ష రత్నమాలికలవాని
రమ్య పద్మవిశాల నేత్రములవానిఁ
బుట్టుగిట్టుల నెఱుఁగని పొట్టివాని
సంభ్రమంబునఁజూచిరా సభ్యులెల్ల. 74

వ॥ అంత. 75

క॥ ఆ పొట్టివాని మాటలుఁ
జూపులు నెమ్మేన వెలయుసోయగమును లో
నాపోవఁగ నీక్షించుచు
భూపాలకుఁ డాదరించెఁ బొలుపగు భక్తిన్॥ 76

వ. ఆద్దానవేంద్రుండు పసిండి గద్దియ గ్రద్దనడిగ్గి కడలి యల్లుని చరణకమలంబులఁదీర్థజలంబులంగడఁగి తజ్జలంబులుమౌళి నలంకరించి కనకాసనంబునఁ గూర్చుండఁ బ్రార్థించి సముచిత ప్రకారంబున సత్కరించి కుశలంబడఁగి వాక్సుమంబులఁ బూజించికపట బ్రహ్మచారికి దానవేంద్ర సంసారి యిట్లనియె.

ఉ. ఎక్కడియూరు నీవెటకు నేమితలంపున నేగుచుంటివి? నీ
చక్కని నామముం దెలుపఁజాలి మాతృకలేవి? నీవు పెం
పెక్కజనింపఁ బావనతఁ బేర్చిన వంశమదెద్ది? నిన్నులో.
మక్కువఁగన్నవారెవరు? మాకు వచింపగదే! కుమారకా?

చ॥ వలచెదు నీమనఃపరమవాంఛితమేమి? ధనంబా! చీరలో
సురుచిర వస్తుజాలములా? శోభనభాగ్యసుమందిరంబులో
కరులా? హయంబులో? తరులోకన్గొనపుణ్యలతావిశేషభా
సురవనివాటికాస్థలమొ? చూతముకాక వచింపుమింపుగన్.

ఆ॥ అవియుఁగాక యొండు నరసెదవో మది
నింతయనక నీకు నిత్తుగాక
బాలకుండవకట పలుకంగ నేర్తువే?
వడుగ! చెప్పుమ! నీదు వాంఛితంబు॥ 80

వ. అనిపలికిన సమ్మాయావటుశేఖరుండు వదాన్యోత్తంసుం
జూచి. 81

ఉ. ఎక్కడియూరు నీదనిన నేమివచించెదనయ్య! నిల్వఁగా
నిక్కడనాకు వాసమని యిక్క యొకండును లేదు పూర్ణనై
యెక్కడ ధర్మమున్నిలుచు నెక్కడ యోగిజనంబులుందురా
చక్కటినుందు నిత్యము ప్రసన్నత పూర్ణసుహార్ద్రవర్తనై 82

సీ. నలినసంభవు కీడునగు ప్రజాపతులెవో
మముఁగన్నవారు సన్మానితాత్మ!

భూరిచతుర్దశ భువనంబులరయంగ
మాకుగేహంబు లస్తోకచరిత!

ప్రియమునసరులేమి పిలచెదరాయన్ని
మానామములుచూవె! దానవేంద్ర!

మూడుభంగుల లోకములను వర్తించుట
మావినోదముసుమ్ము! ధీవరేణ్య!

ఆ॥ తమ్మునెఱిఁగికొన్న ధన్యులె గదమమ్ముఁ
దెలిసినట్టివారు తెల్లమింత
కలరు బంధుజనులు కలిమిబాటింపరు
జూడఁజూడ నొంటివాడ నధిప! 83

ఉ. ఆరయ బ్రహ్మచారినట! యాత్మవిరాగముగల్గి భూరిసం
సారముజూడనొల్లక విశాలతపంబొనరింప బోవునా
కోరికలేమి చెప్పెదు! నమంతితశాంతి వసింపనిమ్ము వి
స్తారముగాక సజ్జనముదావహమయ్యెడుచంద మేర్పడఁగ॥84

ఉ. బాలుఁడు నాకకోరికల పల్కెఁడునాకప్రియంబు జెప్పగాఁ
జాలఁడునాక త్రైపద విశాలధరాస్థలిఁ గోరుటింతయున్
జాలదు నాకనీదలపుజాలిన భూమినొసంగుమయ్య! నా
పాలిట మేరువొనదియ భావమునన్ వగవంగఁబోకుమీ॥85

చ. ఖలులకు నీతిలేదు మదకాముకవృత్తికి వావిలేదు లో
భులకును సిగ్గిలేదు విను! భూరిమరాశకు మేరలేదు దు

ష్టులకుఁ బ్రియంబులేదు రణశూరులకించుక తుష్టిలేదు వి
ప్రులకు నసత్యముల్ విమలబుద్ధికి నడ్డములేవు భూవరా॥86

తే. కలుగునద్దాన సంతుష్టికలుగదేని!
బడయునే సేమమాపద్మభవుఁడున్నైన
చెలఁగి ఉపమానవులమాటఁ జెప్పనేల?
ధన్యగుణసాంద్ర! బుధచంద్ర! దానవేంద్ర! ॥ 87

ఉ. ఇచ్చెదనన్న మాత్రమున నీవికిఁ బొంగుచు చాగకానికిన్
బొచ్చెముకూర బెద్దయనుబోలునె! గోరనతండు నీయఁగా
బుచ్చుకొనంగ ధర్మమగు భూవర! చెప్పెద బ్రహ్మచారికే
నచ్చెరువందమూడడుగులంతియజాలుప్రియంబుగూరెడున్

—::—

* శ్రీ రుక్మిణీపరిణయ మహోత్సవము *

మ॥కలిగెన్ బుత్రి పయోజనేత్రి, విలసత్కల్యాణశోభాంగి, ని
ర్మలనానాగుణపూర్ణ, సాధుజనవిప్రానేకసంస్తవ్య, భూ
వలయవ్యాపితచారుకీర్తియుత, శశ్వద్భక్తమందార శ్రీ
కళనత్యుత్తమమూర్తిభీష్మకునిభాగ్యంబెన్నభాగ్యంబుగాన్

తే॥ ఆమెపడమటి బాలేందుననుకరించి
పూటపూటకు నొకవింత పొలుపుదాల్చి
బాలికామణి యెదుగ శోభనముతోడ
ధాత్రినెల్లెడ జయలక్ష్మి తాండవించె॥ 90

భూరిచతుర్దశ భువనంబులరయంగ
మాకు గేహంబు లస్తోకచరిత!
ప్రియమున నరులేమి పిలచెదరాయన్ని
మా నామములు చూవె! దానవేంద్ర!
మూడు భంగుల లోకములను వర్తించుట
మా వినోదము సుమ్ము! ధీవరేణ్య!

ఆ॥ తమ్మునెఱింగికొన్న ధన్యులె గదమమ్ముఁ
దెలిసినట్టివారు తెల్లమింత
కలరు బంధుజనులు కలిమి బాటింపరు
జూడఁజూడ నొంటివాఁడ నధిప! 83

ఉ. ఆరయ బ్రహ్మచారినట! యాత్మవిరాగము గల్గి భూరిసం
సారము జూడనొల్లక విశాలతపంబొనరింపఁ బోవు నా
కోరిక లేమి చెప్పుదు! నమంథితశాంతి వసింపనిమ్ము వి
స్తారముగాక సజ్జనము దావహమయ్యెడు చందమేర్పడన్ ॥84

ఉ. బాలుఁడు నాక కోరికల పల్కుఁడు నాక ప్రియంబు జెప్పఁగాఁ
జాలఁడు నాక త్రైపద విశాలధరాస్థలిఁ గోరుటింతయున్
జాలదు నాకనీదలపు జాలిన భూమినొసంగుమయ్య! నా
పాలిట మేరువౌనదియ భావమునన్ వగవంగఁ బోకుమీ॥85

చ. ఖలులకు నీతిలేదు మదకాముకవృత్తికి వావిలేదు లో
భులకును నీగిలేదు విను! భూరిదురాశకు మేరలేదు దు

ష్టులకుఁ బ్రియంబు లేదు రణశూరులకించుక తుష్టి లేదు వి
ప్రులకు వసత్యముఖ్ విమలబుద్ధికి నడ్డము లేవు భూవరా॥86

తే. కలుగునద్దాన సంతుష్టికలుగ దేని!
బడయునే సేమమాపద్మభవుఁడున్నైన
చెలఁగి ఈమానవులమాటఁ జెప్పనేల?
ధన్యగుణసాంద్ర! బుధచంద్ర! దానవేంద్ర! ॥ 87

ఉ. ఇచ్చెదనన్న మాత్రమున నీవికిఁ బొంగుచు చాగకానికిన్
బొచ్చెముకూర బెద్దయునుబోలునె! గోరనతండు నీయఁగా
బుచ్చుకొనంగ ధర్మమగు భూవర! చెప్పెద బ్రహ్మచారికే
నచ్చెరువందమూడడుగులంతియజాలుప్రియంబుగూరెడున్

—::—

* శ్రీ రుక్మిణీపరిణయ మహోత్సవము *

మ॥కలిగెన్ బుత్రి పయోజనేత్రి, విలసత్కల్యాణశోభాంగి, ని
ర్మలనానాగుణపూర్ణ, సాధుజనవిప్రానేకసంస్తవ్య, భూ
వలయవ్యాపితచారుకీర్తియుత, శశ్వద్భక్తమందార శ్రీ
కళనత్యుత్తమమూర్తిభీష్మకునిభాగ్యంబెన్నభాగ్యంబుగాన్

తే॥ ఆమెపడమటి బాలేందుననుకరించి
పూటపూటకు నొకవింత పొలుపుదాల్చి
బాలికామణి యెదుగ శోభనముతోడ
ధాత్రినెల్లెడ జయలక్ష్మి తాండవించె॥ 90

క॥ తలఁపగ జగములఁ గావఁగఁ
దలఁపులు లోలోనమిగులఁ దలఁజూపఁగ దాఁ
దలనెత్తదొడఁగె బాలిక
తలఁచిన జనులెల్ల హర్షతతి మునుగంగన్॥ 91

సీ॥ ఒదిగిల బడనేర్చె నొయ్యారమునునేర్చె
నవ్వీన పలుమారు నవ్వనేర్చె
నత్తత్తయననేర్చె నందరఁగననేర్చె
నెత్తుకొమ్మని చేతులెత్తనేర్చె
ధారుణీ తలముపై దూరాడగానేర్చె
నలికుడ్యమూతగా నడువనేర్చె
జెలువొందు జిల్కపల్కుల పల్కనేర్చెను
బాపయిష్టార్థముల్ జూపనేర్చె

తే॥ పరుగులిడనేర్చె దనదల్లి బట్టనేర్చె
నాడ్నేర్చెను మెల్లన బాడనేర్చె
నెమ్మదీనులజూచి మన్నింపనేర్చె
నాదిలక్ష్మి కుమారియై యలరునాడు. 92

క॥ ఐదేండ్ల ప్రాయమందున
వైదర్భుని గేహమందు వఱలిన వేడ్కన్
శ్రీదేవి చదువఁజొచ్చెను
సాదరమున నెల్లవారు సంతోషింపన్. 93

ఉ॥ భారతినేను మీరు సురభామలు రండని వేడ్కఁ గూరఁగన్
భూరివిపంచికాస్వన విభూతిమనోహర భావవశ్యమై
నారదుఁడాదిగా వెఱఁగగునందఁగ శారదమౌళినూపఁగాఁ
గౌరివిపంచి మీటుచును గోమలి పాడు సఖీయుతంబుగన్.

ఉ॥ మీరు సురాసురుల్ దరువమీటిన వేడ్కఁ జనించితబ్ధిదు
ర్వార దరిద్ర శోకముల వారణఁజేయఁ బయోధిజాతనై
కోరికలిత్తు మీకనుచుఁగూరిమి సత్కరుణాప్రపూర్ణతన్
శ్రీరమవోలెనయ్యతివ చెల్వు వహించు జగన్నుతంబుగన్.

ఉ॥ మానుగ నే జగజ్జనని మంగళగౌరిని మీరలంగనల్
పూని నమస్కరించునెడఁ బుణ్యసుమంగళ భాగ్యభోగసం
తాన ఫలంబులిత్తు ననితథ్యముగా గిరిపుత్రివోలె భూ
జానితనూజయాడు నెడఁజాలగ విస్మయమెల్ల వారికిన్.

సీ॥ ఫలపుష్పపల్లవ భవ్యసంపద్భాగ్య
ఘనమ్ములై తనరారు వనములందు
రహిఁ ధర్మ శాస్త్రపురాణ వేదాంతైక
గురుసమంచిత పుణ్యగోష్ఠియందు
పావన గుణపుణ్య భర్తృదైవత సతీ
రాజితశుభ కథాశ్రవణమందు
భజనీయ సద్గుణవ్రజ నిర్మలాచార
భగవదారాధనపరత యందు

తే॥ శారికా కీరగణముల చదువులందు
మోదకరమైన తంత్రి వినోదమందు
భూసురోత్తమ దేవతాపూజలందు
జఱుగుకాలంబు నిరతమా చారుమతికి. 97

*రుక్మిణీ సందేశము*

క॥ ఎందుండి రాక? ధరణీ
బృందారక! నామమేమి? ప్రియమున మది నే
మిందలఁచి వచ్చినారలు?
సందియ మింతేని లేక సమ్మతిఁ జెపుమా! 98

క॥ ఎవ్వని దేశము? మీరా
జెవ్వఁడు? శుభమయ్యె! తనయులెందఱు? తగమీ
రివ్వనధి దుర్గమునకిటు
లెవ్విధమున వచ్చినార లెఱిఁగింపుఁడనన్. 99

సీ॥ భూపురంధ్రి శిరోభూషణంబై మహో
దారమై తనరు విదర్భమాది
యఖిల మానవులకు నగ్రిజాతంబునై
వెలసిన సద్బ్రహ్మకులముమాది
విమతసంతతికైన విజ్ఞాన ముపదేశ
మొనరింపఁబూనిన ఘనతమాది
సకలలోకానీక సౌభాగ్య సంతోష
పుణ్యకారణమైన పూన్కిమాది

తే॥ పరుల కుపకారమొనరించుప్రతినమాది
దీనులకు మేలుగూర్చెడు దీక్షమాది
యాపదుద్ధార! భక్తహృత్తాపహార!
చిరశుభాకార! మానినీచిత్తచోర!. 100

క॥ పేరగ్నిద్యోతనుఁడన
గౌరవమునమూర నూర గణుతింపఁబడుఁ
గారణము నిన్నుఁజూడఁగఁ
గోరితి మాకదియచూపె! కోర్కెకుమారా! 101

సీ॥ భీమవిక్రమశాలి భీష్మకుండనువాఁడు
పరమధార్మికమూర్తి ప్రభుఁడుమాకు
వేదగేయంబులా శ్రీదేవి సత్కథల్
నిరత వినోదముల్ నిజముమాకు
బ్రహ్మాదులంబోలు పరమయోగి జనంబు
లతిప్రియంకరులైన హితులుమాకు
సాధుమహాతప స్సర్వసంపత్తిచే
విశ్వమంగళమైన వృత్తిమాకు

తే॥ నరయశంకరు కీడుజోడైన మునులు
కులముపెద్దలుమాకు ముకుంద! వరద!
నిఖిల వేదజ్ఞమూర్తివి నిన్నుగాంచు
టింబుమై తొల్లిచేయు పుణ్యంబుకృష్ణ!. 102

వ. అంత నావిప్రోత్తముండంభోజనాభు నుద్దేశించి విదర్భ రాజ కన్యా విజ్ఞాపనంబుగా నిట్లనియె?

ఉ॥ శ్రీరమణీశ! యేమనుచుఁజెప్పెద విన్నప మాలకింపు! దు
ర్వారబలుండురుక్మి శిశుపాలుని నెచ్చెలిగాఁదలంచి నఁ
గూరిమినీయఁగాదలఁచెఁగూడదనఁడు మదీయబాంధవుల్
నేరరుకాదు బొమ్మనఁగ నీవసుమీ! కరుణింప నీయెడన్.

ఉ॥ కందువ మాటలన్ దెలుపగాదుసుమీ! వివరించుదానహృ
న్మందిర సీమనిన్నిలిపినాథ! భవత్పదపూజసేయఁ బెం
పొందెదఁదలంపుగానకృపఁబూనుము! పుణ్యచరిత్ర!కృష్ణ! గో
వింద! ముకుంద! వీనులకు విందుఘటిల్ల ప్రియంబబల్కుమా.

సీ॥ ఈనేత్రములతోడ నెవ్వారిఁగనుదాన
భువనమోహనము నీ మూర్తిగాక
యీ కర్ణములతోడ నెయ్యది వినుదాన
మాననీయంబునీమహిమగాక
యీనాల్కతోడ నేనేమి వల్కెడుదాన
సూరిరంజనమునీ సూక్తిగాక
యీహస్తములతోడ నేమిచేసెదుదాన
పావనంబైన నీసేవగాక

తే॥ నిరతమిమ్మేన నేనేమి జరుపుదాన
రమణ! నీకిష్టమైన వర్తనముగాక

షట్పదశ్యామ! రాజన్యసార్వభౌమ!
భనాద్భుతదామ! లోకాభిరామ!॥ 106

చ. సురుచిరభక్తినిన్ గనినచూపులుచూపులు నిన్నుఁగొల్వఁగాఁ
దిరముగఁ లోపలన్ గలుగు తీపులుతీపులు నీవునండఁగాఁ
బరగుటచూవె! కోరనగు ప్రాప్తులు ప్రాప్తులు భక్తలోకర
క్షాపరతంత్ర! యోగిజనకాంక్షితమూర్తి! ముకుంద! మాధవా!

సీ॥ ఎన్నిజన్మలకైన సన్నుతంబుగ నిన్నె
వరద! సేవింపంగ వలచినాను
ఏ కష్టములనైనఁ బ్రకటచారిత్ర!
తప్పక నిన్ గొల్వ దలఁచినాను
ఏచందములనైన నెన్న మన్మథకోటి
శృంగార! నీయందు చిక్కినాను
ఏనీమములనైన కానిమ్ము! నీకథా
సురుచిరామృతవృష్టి చొక్కినాను

తే॥ పాటవంబున నిక వేయిఁబలుక నేల
నీకు వశనైతి మన్నింపు నీరజాక్ష!
పండితస్తోత్ర చారిత్ర! భద్రగాత్ర!
దితిజకులజైత్ర! శ్రీవసుదేవపుత్ర!॥ 108

శ్రీరస్తు

# వి వి ధ ప ద్య ము లు

—: పంచమాగణపతిని సందర్శించిన సమయమున :—

ఉ॥ శ్రీరమణీయ! రావికులసేవిత పాదసరోరుహాయ! గా
రీరమణీసుతాయ! శ్రితబృంద దయార్ణవ మానసాయ! వి
స్తారవరప్రదాయ! జనతాఘనవిఘ్నవినాశకాయ! శృం
గార మనోహరాయ! జనకామితదాయ! నమోనమోస్తుతే.

ఉ॥ నీజనకుండు భక్తుల ననేకవిధంబుల సాకుచుండన
వ్యాజకృపారసంబున మహాద్భుత సంపదలిచ్చుచుండ నీ
తేజమిదేమి? దాసజన దీనతఁ బాపఁదలంపవేమి? నీ
వ్యాజమదేమొ? నిన్నెఱుఁగవచ్చునె? మాకు గణాధినాయకా!

చ॥ అలర నవిఘ్నమస్తనుచు నాదిని నీకు నమస్కరింతునా
కలమున వాక్సునర్తి హృదయకంజమునందున బాయకుండుమీ
మెలపునకార్యదీక్షయును మేటిజయంబుయశంబుగూర్చుమీ
కులగిరి కన్యకాతనయ! కూర్మిల సత్కరుణాపయోధివై. 3

—: తే 1—5—55 దీన అన్నవరక్షేత్రమును దర్శించినపుడు:—

సీ॥ మీ యుహోదా జమీందారుని బిడ్డనై
పడియుంటి నీమండపంబునందు
శారదా సత్కటాక్ష శ్రీలనందియు
నడిగితి నీ సిరు లనుభవింప

గురుదాన ధర్మాత్మ కులజాతనయ్యును
నిన్ను వేడితిఁ బ్రేమ నిండఁజూప
పార్వతీవల్లభు పరమ సత్కృపనంది
చేసితి నీ పాద సేవనంబు

తే॥ నింతచాలదో? నన్ను మన్నింపవకట!
కానికారణ మింకొండు గలదొ చెప్పుమ!
రక్షితాజాండ! కరుణా విరాజితుండ!
రావె! మాయండనుండ నారాయణుండ! 4

సీ॥ ఆదిగర్భేశ్వరులన ధాత్రిఁ బేరొంది
ఘోరదారిద్ర్యంబు గూడగనుట
భూరివదాన్యత్వమునఁ బొల్చి సత్కీర్తిఁ
బలుకష్టముల వెంట బొలువడుట
తలపోయ నార్తబాంధవులన నొప్పారి
నిస్సహాయతనొంటి నిలువగనుట
అక్షీణ లక్ష్మీకటాక్ష సంపదఁబొల్చి
వనవాస దుఃఖజీవనముగనుట

తే॥ వికసితాబ్జాక్ష! నీ పెద్దరికము వడసి
పరులచేఁ బెక్కుబాధలఁబడయనగుట
నీకునిటు మాకు నపకీర్తి గాకయున్నె?
॥రక్షితా॥ 5

సీ॥ కోరలేదొకనాడు సారసనాభనిన్
గురుభాగ్యములమాకుఁ గూర్పుమనుచు

పలుక మెన్నడు మాపబంధ రాజంబుల
నచ్చువేయింపంగ నాసఁగొనుచు
వేడలేదెన్నడు వెఱచి నీ ముంగలఁ
బలువిపద్దశలివి పాపమనుచు
ననవొల్ల మొకనాడు నన్యులతోడనే
సాహాయ్యమును మాకు సల్పుఁడనుచు

తే॥ కాలమిటుమారె నినువేడఁ గాంక్షఁగూరె
గోర్కెలెంతయు నిండారె గొలఁదిమీరె ॥రక్షి తా॥

సీ॥ వ్రాయించినాఁడవు వరద ! మాచేతను
జేగీయమాన మాభాగవతము
చెప్పించినాఁడవు తప్పక మాచేత
మానితంబైన రామాయణంబు
పలికించినాఁడవు పద్మాక్ష! మాచేత
నవసహస్రంబుల నవ్యమహిమ
చేయించినాఁడవు శ్రీహరిమాచేత
వర వేంకటాచలవర్ణనంబు
వానికన్నిటికిక నచ్చువలదటయ్య?
నేఁడుగోరితినింక మన్నింపవయ్య! ॥రక్షి తా॥ 7

—: తేది 22—7—56 న విజయవాడ
కనకదుర్గను సందర్శించిన సందర్భమున :—

ఉ॥ శ్రీరమణీయ వైభవము చెన్నలలార సమస్త భక్త బృం
దార విశాలకీర్తి బుధతాపములెల్ల హరించి శీతలా

దారకటాక్షమొయ్యెనముదంబుజయంబుశుభంబుఁగూర్పవ
మ్మారయనున్నతల్లి జగదంబకునంబకు గేలుమోడ్చెదన్.

చ॥ తనయులకాపదల్ కలుగఁ దండ్రిసహించిన నేర్చుగాక యే
జననిసహింపనేర్చు బుధసంస్తవనీయ! పరాకుగొంటివో!
మునుపటిమాటలన్ దలఁపముఖ్యముగాదని లోఁదలంచినీ
ఘనతరకీర్తి కీపయిన గల్గెడుకందు నెఱుంగకుంటివో? 9

సీ॥ బహుసంపదలతోడి భవనంబు లటుబాసి
చేకొని వనిఁ బ్రవేశించునాఁడు
సర్వకాలవిశేషపర్వమై తనరారు
వాసమాశ్రమమునై వచ్చునాఁడు
సకల బంధు ప్రజాసంరక్షణముచేసి
నిస్సహాయస్థితి నిలచునాఁడు
బుధసంతతికి మేటిపుణ్యుండు మాతండ్రి
యోగియై శివలోకమేగునాఁడు

గీ॥ కానలంబడి కడగండ్ల గడపునాఁడు
పరజనంబులమోసాలఁ బడిననాఁడు
గలిగె నేయంబ చేదోడుగారవంబు
నేఁడు నాతల్లి మమ్ము మన్నించుగాక! 10

సీ॥ అన్యులచేదోడు నడుగలేదని చాటు
ధీరతకీనాడు దీనతమరె

భగవత్కటాక్షంబుఁబడసితి నాఁడన్న
భావంబు సంశయ పరతనిలచె
వెఱపన్న దెట్టిదో యెఱుఁగని తలఁపున
భారమైయొక్కింత భయముఁదోచె
బహుజనాశ్చర్యంపు పద్ధతినడచియు
నొరులకు నొక్కింత నొదుగవలసె
తే॥ సాయమనుమాటఁ దెలియని స్వాంతమందుఁ
గోర్కె నితరుల చేఁదోడుఁగోరవలసెఁ
గాలమెటుమారె నీవింతఁ గానవైతి
వందితాఖిలసూరి! పర్వతకుమారి!. 11

సీ॥ చండప్రచండ మార్తాండు వేడిమిసోకి
వదనంబు నొక్కింత వాడుబార
బహుకష్టముల మున్నె బడలికఁ జేకొన్న
రమణీయమూర్తికి శ్రమముగదుర
బహుభాగ్యభోగ సంపదలమున్ దనరారి
ఘనధైర్య సంపద గలఁగబార
నుడుగక కష్టంబు లొండొండ దోచిన
మనసులో నొక్కింత వనటగలుగఁ
తే॥ దాల్మినిను నమ్మికొల్చు మాతల్లిఁజూచి
సాయమొనరింప లేవొకో? చాలలేవొ?
శక్తిచాలదొ! నిండార సాకలేవొ?
వందితాఖిలసూరి! పర్వతకుమారి!. 12

సీ॥ ఎండవానలజాడ నెఱుఁగనివారలై
దీనతనెన్నాళ్ళు దిరుగవలయు
ఫాలలోచనునిచే ప్రాపునందినవారు
బహుకష్టములనెట్లు బడగవలయు
నఖిలాంబ! నీ సాయమభిలషించిన వారు
పరులతో నేరీతిఁ బలుకవలయు
నార్తబాంధవుబిడ్డలై జనించినవార
లన్యులతోడ నేమాడవలయు

తే॥ కట్టగడపట నీకీర్తికల్లయేమొ?
నీసహాయంబుతోడుగా నిలచునేమొ!
కాలవిధి నేతెరంగున గానవగును!
వందితాఖిలసూరి! పర్వతకుమారి! 13

సీ॥ సకలలోకంబుల సంరక్షణముచేయ
మునిజనార్చిత! నీకుముఖ్యమేని!
బండితవ్రాతంబు పలుకుసిద్ధాంతంబు
నీరజాతేక్షణ! నిక్కమేని?
భక్తరక్షావిలంబన సహింపనినీవు
బహుమూర్తులందుట పాటియేని?
నిజముగా నీతోడునీడనై వర్తింతు
నిరతంబు ననుమాట మఱువవేని!

తే॥ గాలవిధి నిట్లుగాక వేకడచిమున్న
బక్షయుక్తుందుమొ! సద్భాగ్య భద్రితత్తుల

నక్కటా! దైవమటు సేయదయ్యెగాక
వందితాఖిలసూరి పర్వతకుమారి! 14

సీ॥ భూరిచతుర్దశ భువనావనుండైన
తరుణేందుమౌళి మా తండ్రిగాగ
పాలమున్నీటిలోఁ బవ్వళించినసామి
మధుసూదనుఁడు మేనమామగాగ
సకలవిఘ్నంబుల సంహరింపఁగఁజాలు
దంతివక్త్రుండు సోదరుఁడుగాగ
బ్రహ్మాది నిఖిలదిక్పాల దేవగణంబు
తపసిలోకంబు బాంధవులుగాగ

తే॥ దీనజనకల్పవల్లి సాధ్వీమతల్లి
తపములకు బంటనీవు మాతల్లిగాక
మాకు గష్టంబులట యేటిమాట చెపుమ?
వందితాఖిలసూరి! పర్వతకుమారి! 15

ఉ. తమ్ములు పిన్నవారలు మదంబమహోన్నత పుణ్యశీల, వారిమ్ముల భోగభాగ్యముల నీ తటినుండఁగనన్ దలంచి కష్టమ్ములఁ బాపఁజాలుదవి సర్వవిధంబుల విన్నవించు వాక్యమ్ములుగానియొండు తెఱఁగాడుటగాదుసుమీ! శివప్రియా!

* శ్రీ పార్వతీ పంచరత్నములు *

శ్లో॥ ఓంకారత్రియ రత్నపీఠనిలయే! ఓంకారబీజాత్మకే!
క్లీంకారార్థ వినోదమోదకలితే! కీర్తిప్రభాపోజ్జ్వలే!

* ఆంధ్రదేశీయ కళాసమున్నతి *

సీ. భూరివేదాంతైక సారసమ్మిళితమై
తనరు విశ్వఖ్యాతిఁ దెనుఁగునీతి
భువనసమ్మోహన పుణ్యసద్భక్తిమై
తనరు విశ్వఖ్యాతిఁ దెనుఁగుగీతి
శౌర్య విక్రమకళాసహజ సౌభాగ్యమై
తనరు విశ్వఖ్యాతిఁ దెనుఁగుజాతి
వివిధదేశాద్భుత విభవసంపన్నమై
తనరు విశ్వఖ్యాతిఁ దెనుఁగుభూతి
తే॥ పలుకుటకు సొంపు నాలకింపంగ నింపుఁ
దెలియఁజెప్పఁగఁ బెంపుముత్తెములగుంపు
మేలికపురంపు నిగ్గుల మేలవింపు
వనజభవు తొయ్యలికి భూష తెనుఁగుభాష.

సీ॥ ఇంటింటనీక్షింప నెంతేనిఁ గన్పట్టు
కానవో? మనయాంధ్రగౌరవంబు
బంటు బంటులలోన భద్రమై వర్తిల్లు
చాటవో? యాంధ్రతేజంబు కలిమి
మాటమాటలలోన మధురిమలూరించు
నెఱుఁగవో? యాంధ్రసాహిత్యగరిమ
నాటినాటికిఁజూడ నవ్యమై సొంపారు
తెలియవో? ఆంధ్రజాతీయ కళను
తే॥ ఘోరరణమున మెప్పించు పౌరుషంబు
వీరధైర్యంబు పిడికిలి విక్రమంబు

జాతు! వోదేశదేశాల సాహసమున
మేలు సోదర! నేఁడైన మేలుకొనుము.

సీ॥ నాఁడు రాజనరేంద్రునాడు భాషాభూష
తెలుఁగు బాసవహించు జిలుఁగు వెలుఁగు
నాఁడు మా శ్రీనాథు నానావిధానేక
కల్పితాంధ్రాలోక గౌరవంబు
నాఁడు రాయలనాడు నవ్యకావ్య విలాస
పాండిత్యగరిమల ప్రాభవంబు
నాఁడు మా త్యాగయ్య నవ్యసూక్తిజనించి
ప్రజల నాకర్షించు భక్తిపెంపు

తే॥ మఱల రేకెత్తి తెనుఁగులమానసమున
హృద్యమేపార జాతీయవిద్య వెలసి
కనుల కుత్సవమొనరంగఁ గాననగునె!
యబ్బురంబున నింటింట నాంధ్రభూమి. 24

సీ॥ అన్యదేశీయ గర్వాంధకారములాప
వెలుఁగులయెకిమీడు తెలుఁగునాడు
భద్రసామ్రాజ్య వైభవ సమున్నతిఁజూప
బలభేదిపురికీడు తెలుఁగునాడు
నవ్యనవ్యకవిత్వ నానాప్రభావాన
జిలుఁగులవీడువో తెలుఁగునాడు
సంఘకాఠిన్య దౌర్జన్య సంచారంపు
బలువిపత్తులసూడు తెలుఁగునాడు

తే॥ మేలిరతనంపు కలుములమేల మాఁడు
కలిమికడలికి సైదోడు తెలుఁగునాడు
సూటినానాటి తెలుఁగుల పాటవంబు
వెలయసిరిఁ గూడుగద ! నేఁడు తెలుఁగునాడు 25

* సాధురక్షణ సంరంభ ! శారదాంబ ! *

20-3-1956 తేదీని కవయిత్రి సహాధ్యాయినియైన శ్రీ రామారావు శారదాంబ నుద్దేశించి చెప్పినపద్యము. ఈమె బాల్యమునుండియు ఏ స్కూలునందును ప్రవేశింపకనే ప్రైవేటుగా '52 మార్చిలో మెట్రిక్యులేషన్ ప్యాసయి, '56 మార్చిలో బి. కాం. పరీక్షయందుత్తీర్ణులైనారు.

సీ॥ అనవద్యహృద్య విద్యాసిద్ధి నిచ్చితి
 రాజభాషాభూష "రాష్ట్రభాష"
జాతీయచారిత్ర శాస్త్రసంస్కృతులవ
 ర్ధిలఁ గొన్న దీక్ష "మెట్రిక్ పరీక్ష"
శాస్త్రార్థవిజ్ఞాన సారస్వతాన వి
 ద్యాదీక్ష, సమితి "గీతాపరీక్ష"
వ్యాపారగణిత శాస్త్రార్థ సంపత్తితో
 మేలైన "ఇంటరుమీడియేటు"
తే. నెటులనను 'పట్టభద్రు'గఁ జేయిరమ్ము
విశ్వవిద్యాలయాగ్రప్రవేశనిగను
నిండుముదమున నన్నుఁ గనియుండఁజేసెదు !
సాధురక్షణసంరంభ ! శారదాంబ !

# ★ ఈ కవయిత్రుల కృతులు

1. సీతారామాయణము
2. మహాలక్ష్మి భాగవతము
3. శ్రీమద్భగవద్గీత
4. అన్నవరమాహాత్మ్యము
5. వేంకటాచల మాహాత్మ్యము
6. సహస్రనామ స్తోత్రసంగ్రహము
7. శతక పంచకము
8. స్తోత్రరత్నాకరము.